చమత్కారమును నీ వెఱుఁగవు కాఁబోలును. ఈచీటి చదువు కొ“మ్మని యాయుత్తరము నతనిపై వైచెను. అతఁడాయుత్తరమును నామూలాగ్రముగఁ జదువుకొని విస్మయముతో నొకమాఱు గుండెకొట్టుకొని “అమ్మా జస్వంతరావెంత వాఁడయ్యెను. ఇంతవాఁడగునని నే నెన్నఁడు నెఱుఁగను. అమ్మా వ్యవహారము శ్రుతిమించి రాగమునఁ బడినది. మనము జాగ్రత్తగ నుండవలెనని చెప్పెను. అనవుడు నాదేవి “ఇటువంటి తుచ్ఛులు వేయి పన్నుగడలు బన్నినను నేను బెదరను. వారికి వినాశకాల మాసన్నమగుటచే నట్టిబుద్ధులు పుట్టినవి. వారు నాకు లోఁబడకున్నను వారి ప్రాణములు నాఖడ్గమునకు లోఁబడక మానవు. కాని మనకు నెవ్వరు కృతజ్ఞతగ నుండరో వారినందఱఁ బేర్కొను” మని ప్రత్యుత్తర మిచ్చెను. రాధాకాంతరావాపలుకుల నాలకించి రాణి మనోధైర్యమునకుబ్బి “శివనానా మనకాప్తుఁడు. అతని నింబపురమందుంచుటతో మీరు మంచిపని చేసినారు. గోమాజీరావు కొత్వాలుకూడ మంచివాఁడనియే తోఁచుచున్నది. తుకాజీ హోల్కారు కుక్కవంటి విశ్వాసము గలవాఁడు. కాని నీచుఁడగుటచే నతనికి గొప్ప యుద్యోగమీయఁదగదని యుగ్గడించుచుండ నతని మాట కడ్డమువచ్చి రాణి “వంశముచేత నీచుఁడైనను గుణములచేతను రాజభక్తిచేతను మఱి తుకాజీ యుత్తముఁడు. అందుచేత నతనికి సైన్యాధిపత్యమొసఁగితిని. గోమాజీరావు సంగతి నిశ్చయముగఁ జెప్పఁజాలను. నీవాతనిఁగూర్చి వాకబు చేయుచుండుము. కాని వీనికంటే నాకు నెక్కువ విచారము

పట్టెనది. ముక్తాబాయి కలఁతపడియున్నది. ఆమె తమ్ముని నిమిత్తము బెంగపెట్టుకొనినది. మనోవ్యాధికి మందు లేదుగద! దీనికేమి యుపాయము చేయవలెనో యోజింపఁగనని" పలికెను. అప్పలుకులువిని రాధాకాంతరావు రాణితో నిట్లనియెను. "ఆమె సహజముగ బెంగపెట్టుకొన్నది మనస్సు తమ్మునిమీఁద నుండకుండ నిరంతరము నామె కుత్సాహజనకములగు పలుకులు చెప్పువారుండవలయు. అట్లు చేయుటకు మాఱుఁ దీనికి లేదు. నాదగ్గఱ నొకదాసి యున్నది. ఆమె బహు చమత్కారక కథలు నేర్చును. ఏప్పువారికైన నామె మొగము జూచిన సకలదుఃఖములు పోవును. ఆమెను నేనిక్కడకంపెదను. ముక్తాబాయి నామెకు జతచేయుఁడు. అంతట నామె దేహమునఁగల రుగ్మత నశించును. ఇఁక నే సెలవు గైకొని పోయి వచ్చెదను. కానియనుగ మఱదినాఁడు. దౌలతరావు విషయమై యేమిచేసినారు? స్త్రీ రాజ్యమేలుచుండ స్త్రీకి మానగౌరవము దక్కకున్నచో నింకఁ జెప్పునది యేమి? అన్నియు ముగిసిన వెనుక మీరు కనుగొన్న నేమిలాభము? ఆమె ప్రాణత్యాగముఁ జేసికొనకమునుపే యామె పాతివ్రత్యము చెడకమునుపే మీరు సాయము చేయవలెను." అను రాధాకాంతుని కఠినోక్తులచే రాణికి రోషము జాలియుఁ గల్గినందున యామె "ఓయీ నేను జీవించియుండ గమలాబాయికి మానభంగ మగునా! దౌలతరావును బిలిపించి యిప్పుడే మందలిచెద. ఇదివఱకే రమ్మని వానికి వర్తమానము బంపితిని. ఎంత కష్టమునకైన నోర్చి యామెను రక్షింతు. నీవింకఁ బొమ్ము. దౌలతరావు వచ్చువేళ యైనది." అని పలికెను. రాధా

కాంతుఁ డందుకుసంతసించి సెలవు గైకొని స్వగృహమున కరిగి కమలాబాయి స్థితి గనుఁగొనుమనియు నామెతోఁగొన్ని రహస్యములు జెప్పుమనియుఁ దనభార్య నంపి యామెవిషయమై జాగ్రత్తగ నుండెను.

రాధాకాంతరా వరిగిన యొకగడియలోపున గాంతరావు తన యేలిక దర్శనమునకు వచ్చి గుమ్మమునందుండి తనరాకఁ దెలియఁబరిచెను. లోపలికి రమ్మని సెలవయిన తోడనే మొగమున లేనిగాంభీర్యమును దెచ్చిపెట్టుకొని మొలలో నొకవేళ నపాయమేదైన జరుగునేమో యని ప్రాణసంరక్షణార్థమై తెచ్చిపెట్టుకొన్న కయిజారుగనుఁ బడకుండఁ జేసి లోని కరిగి రాణీదర్శనము చేసి సాష్టాంగ నమస్కార మొనర్చి నిలువఁబడెను. రాణి నాలుగు నిమిషములు వానివంకఁ జూచి కూర్చుండుమనెను. తరువాత వారియుభయులకు నీక్రింది సంభాషణ జరిగెను.

అహ—పాపము మీయన్నగారు పోయినందుకు మాకుఁజాల విచారముగ నున్నది? ఈ వేళకు నారునొకటి కాదా? నీకుఁ బెద్ద కష్టము వచ్చినది.

దౌల—(తలవంచి) ఏమిచేయఁగలము. కాలవశము.

అహ—అతనిభార్య యెక్కడున్నది? క్రొత్తగాఁ పెండ్లి యొనదఁట కాదా!

దౌల—ఇక్కడనేయున్నది. పెండ్లి కాలేదని చెప్పుచున్నారు.

అహ—ఛీ! ఏమిమాటలు, నాదగ్గరఁగూడ నబ్లైయనెద వేల. నీ వామెను బలవంతముగా వివాహమాడ యత్నించుచున్నావఁట! నారాజ్యములో నీవు దుర్మార్గము చేయకుము. ఇటువంటి వానిని క్షమియింపను. అన్న భార్యను బెండ్లియాడుటకు నీకు సిగ్గులేదా?

దౌల— అమ్మా! నే నామెవిషయమై యెట్టిదుష్కార్యముఁ దలపెట్టలేదు. కిట్టనివారు చెప్పినయబద్ధముల నమ్మి మీరు నన్ను శిక్షింపఁ దలంచుచున్నారు. నే నట్టిపని చేయుదునా? అన్న భార్య తల్లికాదా? పెండ్లి కాలేదని నేను స్వీకరింపఁదలఁచితిని. పెండ్లియైనమాట నిజమైన నా కామెవద్దు.

అహ—సరే! జస్వంతరావు మాపైని నలుక వహించినాఁడట. నీవును నందుఁ జేరినవాఁడవేనా? ఇంక నీవంటి వారెందరు—

దౌల—రామరామ! నేనుపాప మెరుఁగను. మీ పాదములతోడు, శ్రీవిశ్వేశ్వరస్వామివారితోడు. సెలవైన జస్వంతరావును బట్టి యిచ్చెదను.

అహ—తన ప్రాణముల కాసపడ వద్దని జస్వంతరావుతోఁ జెప్పుము. మీరందరుఁ జచ్చినట్లు భావించుకొనుఁడు ఇఁక నీవుపో.

అని యహల్యాబాయి దౌలతరావు నంపెను. దౌలతరావు నోటికివచ్చినన్ని యనృతములాడి రాణియాగ్రహము నకుఁ బాత్రుఁడు కాకుండఁ బులినోటఁబడి తప్పించుకొనిన

మేఁకవలె సంతసించుచుఁ బోయెను. అట్లు దొంతరావింటికి వచ్చునప్పటికి భార్య దుర్గాబాయి గృహమందు లేకుండుట ఇదె సందని కామబాధావివశుఁడై కమలాబాయియొక్క కమలములవంటి పాదములపైఁబడి తన్ను వివాహము చేసి కొమ్మని యామెను బహువిధములఁ బ్రార్థించెను. కమల భయసంభ్రమములతో వడఁకుచు నాతనిఁ దనపాదములతో దన్ని యాడరానిమాటలాడి యనేకవిధముల నిందించి గోదనము చేసెను. మన్మథబాణములచే దేహము చిల్లిపడ ముల్లుకులవంటి యామెపలుకు లంతపనిఁ జేయవయ్యెను. సిగ్గునినీవఱకే విడచుటచే నెగ్గు వాని కగపడదయ్యెను. అందుచే నాతఁడు వడఁకుచున్న యావన్నెలాడిని గట్టిగఁ బట్టుకొని సందిటఁజేర్చి యాలింగన సౌఖ్యము కొరకు యత్నించుచుండ నామె బెదరిన మార్జాలమువలె గోళ్లతోడ రక్కి యురవ సాగెను. ఆమె గోరుకులు వాని యంగమునుండి రక్తము స్రవింపఁజేసి కుంకుమ నలందుకొన్న పెండ్లికుమారుని విలాసము నతని కొసఁగెను. అంతలో దుర్గవచ్చి తలుపు గొట్టినంతఁ గమల యామెకుఁ దలుపు దీసెను. దొంతరావు చేసిన చర్యలను దుర్గ కమలాముఖమున విని యట్టిమగనికిఁ దాను భార్యగా నుండుటకు సిగ్గుపడి కమల నూరార్చి మగనిని శూలమువంటి మాటలతో నొప్పించెను కాని నల్లరాయి వలె నతఁడు నిరుత్తరుఁడై కమలను వశము జేసికొను నుపాయమును వెదకు చుండెను. ఇట్లతఁ డాలోచనలు సలుపుచుండఁగానే సూర్యుఁడపరశైలశిఖరము నలంకరించెను. రాత్రి

యందరు భోజనముచేసి పండుకొన్న తరువాత నిద్రాసక్తులైరి. రెండుజాముల రాత్రి యైన తరువాత దౌలతరావు తాను నిద్రించుచున్న గదివిడిచి తళతళ మెరయుచున్న ఖడ్గమును గైకొని కమల శయనించు గదిం బ్రవేశించి "దురాత్మురాలా! కమలా! నీవు నాకు నక్కరకు రానిదానవు. నీవుండిన నేమి చచ్చిన నేమి? నిన్నిప్పుడు చంపివైచెద" నని ఖడ్గము నామె మెడ మీఁదనుండి యొకవేటున వేయఁగ నెత్తెను. అంతలో నామె ముఖవికాసచంద్రికలు కోపావేశాంధకారమును బాపినందున "ఈమె నిప్పుడు చంపను. ముందుముం దీమె తప్పక నాశము కాఁగలదు. కాకపోయినచో నప్పుడే తుదముట్టించెద" నని తన దుష్ప్రయత్నము మాని మరల లోనికిం జని నిద్రించెను. నాలుగుగడియల రాత్రియుండఁ గమల మొగమున మేలిముసుఁగు సగఁజారవైచికొని యెవరితోడను జెప్పక గృహమునుండి వెడలిపోయెను. ఎక్కడికరిగినదో యెవ్వరు నెఱుఁగరు. ఉదయమున దుర్గయు దౌలతరావును గమలం గానక కలవరపడి దుండిరావును లక్ష్మణుని వెదకుమని పంపిరి. అంత దుండిరా వెచ్చటనో గంజాయిద్రాగి మత్తుగొని పండుకొని సాయంకాలమున వచ్చి కమల కనఁబడ లేదని చెప్పెను. దీపము పెట్టిన తరువాత లక్ష్మణుఁడు వగర్చుకొనుచు వచ్చి దౌలతరావుతో రహస్యముగ "అయ్యా! వల్లమందు చెట్లతోఁటలో నున్న నూతిలోఁ బడి కమల చచ్చినది. శవ మొకగడియ క్రిందటఁ దేలిన" దని భయపడుచు జెప్ప దౌలతరావు తలయూఁచి, "సరే భయమేమి నేను జేయవలసినపని తానే చేసికొనినది కాని యెవ్వరికిఁ దెలియకుండ

దహనము చేయుఁడు" అని పలికి నాలుగురూపాయలిచ్చి వానిని దుండిరావును బంపెను. వీరిరువురు తోఁటలోనికిఁ జనునప్పటికి నూతియొద్దున నొకవృద్ధుఁడును నొకపడుచువాఁడును నపుడే తెలిసశవమును జూచి విలపించుచుండిరి. అందు వృద్ధుఁడు "అమ్మా! నిన్నీ బలవంతమరణముపాలుచేయుటకే వానికిచ్చి పెండ్లిచేసితిని. కాకున్నచో నీమరిఁది కింత చేటుకాలము రాదు." అని విలపింప నందుఁ బడుచువాఁడు వానినూరార్చి యిది యేడువఁదగిన సమయముగాదు. ఎవ్వరో వచ్చుచున్నారు. పదపద యని వానిని గెంటికొని పోయెను. తరువాత దుండిరావును లక్ష్మణుఁడును మెల్లగా శవమును బయటికిఁదీసి మోసికొనిపోయి దహనము చేసిరి.

## త్రొమ్మిదవ ప్రకరణము

ధరణీమణికిఁ గాలపురుషుండు పట్టిన ధవళచ్ఛత్రము వలెఁ జంద్రుఁడు గగనభాగము నలంకరించి చెట్లకుఁ బర్వతములకు సమస్త పదార్థములకు నపేదుపూఁతపూసిన తెరఁగున దన వెన్నెల వ్యాపింపఁ జేసి వాని కపూర్వధావళ్యము నొసంగెను. ఆ వెన్నెలలోఁ దనయజమానునియాజ్ఞ శిరసావహించి దుండిరావు మహాపురసమీపమున నున్న గూడెముఁజేరి యుందున్న ఋషికుటీరముఁ బ్రవేశించెను. ఋషి వానిం జూచి

యాలింగనము జేసికొని "నాయనా! తండ్రీ! నీవువచ్చితివా! మన రాణోజీ స్మృతినొందినాఁడు గదా దౌలతరావు చేయునది యేమియని యడుగుటయు దుండిరావు వానికి నుత్తరము చెప్పుటకు యత్నించుచుండ నింతలో దీర్ఘకాయుఁడును మహాసత్త్వుఁడునగు నొకనల్లని మనుష్యుఁడు కుటీరముఁజొచ్చి వారిసంభాషణ కాటంకము గావించెను. ఆపురుషునిగడ్డము కాయముకంటెఁ గొంచెము నల్లనై జుట్టువలె నతిదీర్ఘమై యుండెను. అతని శిరమున నలుకొన్న జడలును జడలనడుమ నతఁడు చూడామణిగ నుంచుకొన్న నెమలి పింఛమును మెడను ధరించిన పలురంగులుగల పూసలును చేతనున్న గండ్రగొడ్డలియు నతఁడు పర్వతప్రాంతముల వసించునాటవికుఁడని తెలియఁజేయును. చింతనిప్పువలె నుండువానికన్నుగవనుండి వెడలు దృష్టి రాతిగుండెగల దుండిరావునకుఁ గూడ భయంకరమై యుండెనని నింకఁ జెప్పనది యేమి? అతఁడు లోపలఁ బ్రవేశించి తనమాట మహారాష్ట్రపుమాటలతో నిట్లనియెను. "దాంతియా రా లేదా? ఈ దుండిరావు వచ్చి మీతో నేమి చెప్పినాఁడు? మన మితఁడు చెప్పినట్లు చేయవచ్చునా" అని యన ఋషి "ఓయీ గండా! వచ్చి కూర్చుండు" మని "నిమ్మళముగ విచారింప వలసిన యంశములు నీదుండిరావు చెప్పినమాటలు విను" మని సందేశ మెఱిఁగింపుమని దుండిరావును హెచ్చరించెను. అనంతరము దుండిరావు మెల్ల మెల్లగా నిట్లు పలికెను. "ఓయీ గండా భిల్లుఁడా! మనపుణ్యము పుచ్చినది. జస్వంతరావు, దౌలతరావు, గోమాజీరావు మొదలగు ప్రబలులు రాణీతోఁ బగ

సాధింపఁగ త్రిగట్టినారు. అందుచే నీవు నీభిల్లసైన్యముతో వారికి సహాయముగవచ్చి రాణి నెఱ్చితివేని యుభయపక్షములకు లాభ ముండును. నీవు దోచుకొన్న సొమ్ము నీవే తీసికొనుము. అది గాక మల్హారరావు హోల్కారు మరణము నొందినప్పుడు తన మనుమఁడు చచ్చినని కోడలు మరల నొకని దత్తతు జేసి కొన వలయునని మరణశాసనము వ్రాసినాఁడు. వారిబంధువు గాని కుర్రవాఁడే యున్నాఁడు. మనవారాతనిని హోల్కారుగఁ జేసి కొద్ది దినములలోఁ బట్టాభిషేకము జేసెదరు. క్రొత్త హోల్కారునకు మీరు సహాయము సేయుఁడు.

ఋషి—ఆ హోల్కారును నే నెఱుఁగుదును. అహా! మిక్కిలి బాగున్నది. గండా! నీకు నాదేహ మెందుకు? అహల్యాబాయి సింహాసనముమీఁద నుండుట. రాఘోనాథరావుతోఁ జెప్పినాను. శ్యాముసు దరదత్తు నాతో మాటాడినప్పుడు నేను వారి పక్షము పల్కితిని. గాని నేను వారిసంహారము జూచువాఁడను. మల్హారరావు నాకుపకారము జేసినాఁడు. ఆకసి నేనిప్పుడు తీర్చుకొందును. దేశమును సంగములోఁ బెట్టి వేఁచి వైవవలెను. నీ రెండువేల భిల్లసైన్యముతో ద్రోపిడి వెంటనే యారంభింపుము. నీకు నాదీవన నిచ్చెదను; ప్రజలకు నాయందున్నం బట్టి నాపై మిగుల భక్తి గలదు. వారు నామాయాసముద్రమునఁబడి మునిఁగినవారలు. నీవు జంకకు.

గండాభిల్లుఁడా పలుకుల నాలకించి యడవి జంతువులెల్ల ఖణిల్లని యొకవింత కేకవైచి "యిదసరి. యిదసరి. నాతమాష

చూడుము. ఈపని నెరవేరునేని నూరుమన్నపోతులను శ్రీకాళికి బలియిచ్చెదను. దొరికినయెడల మనుష్యుని బలియిచ్చెదను. ఢుండీ నేనిందులకు సమ్మతించితినని మా దౌలతరావుతోఁ జెప్పుము”

ఢుండీ—మల్హారురావు మన యీఋషికి నపకారము చేసెను. అహల్య కమలాబాయిని వివాహమాడవద్దని దౌలతరావును నిందించి యనరానిమాటలను పరిభవించినది. అదిగాక కమల నూతిలోబడి మృతినొందినది. కాబట్టి దౌలతరావు రాణిపైఁగల కసి దీర్చుకొనుటకు మిమ్ముఁ గలియఁ గోరినాఁడు. అది ఋషికిని మాకును నిష్టము. ప్రభువుతోఁ జెప్పి క్రొత్త హోల్కారుపట్టాభిషేకప్రయత్నములు చేయుచుండెదము. నీవును దోఁపిడి నారంభింపుము.

అని చెప్పి ఋషికి నమస్కరించి గండాభిల్లునొద్ద సెలవు గైకొనఁబోవుచుండ నొకమనుష్యుఁడు పదునేడువత్సరముల బాలుని నొకని వెంటఁ బెట్టుకొని వచ్చెను. ఈ వచ్చిన మనుష్యుఁడు సర్వాంగలక్షణముల గండాభిల్లునికంటె నెక్కువవిలక్షణముగను, నెక్కువభయంకరముగను నుండెను. కాని యాతనికంటె నొకయడుగు పొట్టి. గండాభిల్లుని కంటెఁ బొట్టిదగు గాక యతఁడు వానికంటెఁ గ్రూరుఁడు. వెంటనున్న బాలుఁడు గడగడ వడఁకుచు వెఱ్ఱివెఱ్ఱి చూపులు చూడసాగెను. అతఁడు సౌందర్యశాలి శాంతియాబిల్లు బాలునితో ఋషికుటీరముఁ జేరి గండాబిల్లుని జూచి, “ఓరీ నీ నిమిత్త మీసుందరుఁడగు

పిల్లవానిఁ దెచ్చినాను. పునహానుండి యీశ్రవాఁడిందూరు నగరమునకుఁ బయనమై పోవుచున్నాఁడు. ఈతని నీయిష్టము వచ్చినట్లు చేసికొమ్ము" అని యబ్బాలుని చేయిపట్టి లాగి చూపెను. ఋషి వాని మొగమును దీపము వెలుగునఁ బరీక్షించిచూచి "యీతఁడు కాళికి బలినిమిత్త ముపయోగించును. తీసికొని వెళ్ళి బలియిమ్ము" అని యుత్సాహము గిల్లునట్లఁ బల్కెను. పలుకులయు నబ్బాలునిగుండె ఝల్లుమన యొడల జల్లఁజెమటలు పట్టెను. పట్టినతోడనే, "అయ్యో" యని కేకవైచి గుభాలున మూర్ఛిల్లి నేలవ్రాలిన మోడువలెఁ బడి స్మృతిదప్పియుండెను. శాంతియా వానినిజూచిమహాకోపముతో "దొంగవేషము వైచెదవా? బద్మాష్" అని కొరడాతోఁ జెళ్ళుచెళ్ళున వీఁపుపై రెండు చఱువుఁ జఱచెను. కాని భయావేశమే కవచముగాఁగల యాబాలుఁడు దెబ్బలవలన మేలుకొనఁడయ్యెను. "ఇప్పుడే యీతని బలిపెట్టుదమురా" యని శాంతియాభిల్లు గండాభిల్లుని వెంటఁబెట్టుకొని యాబాలుని శవమువలె మోసికొనిపోయిరి. ఈబాలుని ప్రాణముల నెట్లయిన రక్షింపవలయునని దుండిరావునకు సదుద్దేశము గలిగినది. కాని యామాట వారితోఁ జెప్పినచో వారు తన్నే చంపుదురని భయపడి యూరకుండి మెల్లగాఁ దనస్వామి యొద్దకుఁ జనెను.

ఇదియైన కొన్నిదినములకే దేశమునందక్కడక్కడ బందిపోటులు, కన్నపు దొంగతనములు, దారులు గొట్టుటయు నారంభమై దేశమంతయు నట్టుడికినట్లుడుకసాగెను. స్త్రీలను జెఱపెట్టుట, దొంగతనము మాని మానప్రాణములకును

మర్యాదలకును భంగము లేకుండఁ జేయు జనులందరు రాణితో మొఱ్ఱలు పెట్టుకొని యీరాజ్యమునుండి పాఱిపోవుదుమని చెప్పిరి. నిరంతరమును గ్రామములు పరశురామప్రీతి యగుట చేతను, జనులు పుల్గులవలె వేటాడఁబడుటచేతను నహల్యాబాయి ప్రజల ధైర్యమును స్వసైన్య ద్రోహమును దసయునస్థితియు నరాజకమును జూచి విసిగి చేయునదిలేక దుఃఖితయయి రాజ్యభారమును విడిచి మంత్రులకు లోఁబడుట యుచితమని యోచించుటకుఁ గూడ సిద్ధమయ్యెను. అట్లుండి, రాధాకాంతుని శ్యామసుందరుని బిలిచి యామె వారితో నిట్లనియెను. "అయ్యా! ఇఁక నారాజ్యమెందుకు? నేను దీని వదలి కాశీనగరముఁజేరి విశ్వేశ్వరస్వామివారి చరణముల నాశ్రయించుట మంచిదని తోఁచుచున్నది. పరమపతివ్రత యగు కమలాబాయి నిష్కారణముగా నూతిలోదిగి చచ్చినది. ఆ నేరమును బట్టుకొని యీపాపాత్ములను శిక్షించువారు లేరైరి. మీఁదుమిక్కిలి జస్వంతరావు ప్రేరణచే రఘునాథరావు మనపై దండు వెడలునఁట! అది నిజమని పీష్వాసభలో నున్న దాదాజీగోక్లా తనతోఁ జెప్పెనని మన కృష్ణాపంతులు నిన్ననే పునహానుండి వచ్చి చెప్పినాడు. భిల్లులోకములుఁ బ్రజలను మాడ్చుచున్నారు. ప్రజలు నాజీవమున కుసూరుమన్న తరువాత నారాజ్యమెందుకు? పన్నులు గైకొని సుఖియించుటకా! నేనేమిచేయుదును" అని నిర్విణ్ణురాలై పలుకు మహారాణినిజూచి రాధాకాంతుఁడు "అమ్మా! యీదురాత్ములు లోఁబడకపోరు. పాపమెన్నఁడును నెగ్గదు. నేను, శ్యామసుందరదత్తు, తుకాజీ, శివనానా జీవములతోనుండ

నిండూరు రాజ్యలక్ష్మి యీమహారాష్ట్రులచేఁ జిక్కెను. మీరు మాకు ధైర్యము జెప్పవలసినది మీరుధైర్యవంతులై యుండిన నేని మే మెంతటి కార్యములనైన సాధింపనేర్తుము. సందేహము వద్దు. అమ్మా! యీముక్తాబాయికి శరీరమును సుఖముగ నున్నదా? దాసి యెట్లున్నది" అనియడుగఁగ అహల్యాబాయి; "నేను మిమ్ము నమ్మియున్నాను. మీవును శ్యామసుందరదత్తును బోయి దొంగలఁ బట్టుకొనుఁడు. మఱియొక సమాచారము నాకు లేదు. నీవు పంపినదాసి మూలమున నాకుఁ గొంతయుఁ దెలిసినది. అది కడుచమత్కారి. ఎప్పుడామెను సన్మానించుము. సీతాబాయి మొగముజూడ నన్నివిచారములు నశించును." అనిచెప్పెను. శ్యామసుందరుఁడంత "అమ్మా! యిదె నేనును రాధాకాంత రావుగారును నరిగి దొంగలలో ముఖ్యులఁ బ్రాణములతోఁ దెచ్చి మీకొప్పగించెదము. సెలవొసంగుఁడు. పోయెదము. తుకాజీని సైన్యముతో సిద్ధముగ నుండుమని యానతిండు" అని రాధాకాంతరావును దత్తును రాణివీడ్కొనిపోయిరి.

## పదియవ ప్రకరణము

సూర్యరశ్మి యెట్టిదో యెన్నఁడు నెఱుఁగనట్టి చీమ దూఱని చిట్టడవి యని చెప్పఁదగిన వింధ్యపర్వత ప్రాంత భూమియందొకచోట, కొండగుట్టలచే నావరింపఁబడు నొక కోనలో నొకనాఁడుదయమున నాకాశమును బీటలువాఱ

జేయు మహాకోలాహలము మొనరించెను. అడవి మృగములవలె ఘీంకారాది భయంకర ధ్వనులతోడ భిల్లులందఱు మహావేశమునొందిన భక్తి పారవశ్యముచేత నెదుట వృక్షమునఁ గట్టఁబడిన బాలకునిపై దృష్టులు నిగిడ్చిరి. ఆ బాలకుని శరీరమునందంతట జేగురుటగంధము పూయఁబడెను. మెడయందున నెత్తుటి కుంకుమబొట్టు పెట్టి యప్పుడప్పుడే పూయఁబడిన తలనుండి బాష్పజలము లొలుక నా బాలకుండు భిల్లులవలన శ్రీకాళికి బలి యీయఁబడుటకు సిద్ధముగ నుండెను. వాని హృదయస్థిత దుఃఖమును వేఁడికన్నీరు తెలుపుచుండెఁ గాని నోటిమాటలు తెలుపుట లేదు. వెనుక తాంతియాభిల్లు తోపులోఁ బట్టుకొన్న సుందరాకారుఁడగు బాలుఁడా దినమున గండాభిల్లుచేఁ దమ దేవతకు బలి యీయఁబడు చుండుటయే యీకోలాహలమునకుఁ గారణము. అమితానందరసమున నోలలాడుచు భిల్లులు భిల్లాంగనలునుండ బల్లివలెఁ జెట్టున కంటిపెట్టుకొని యమిత దుఃఖరసమున నీవత్స యమలోక ప్రయాణమునకు మూటగట్టుకొనెను. అప్పుడు వారిలోనెల్ల పెద్ద తళతళ మెఱయు ఖడ్గముఁబూని యోఱునుండి వఱకుటకు సులువుగ నుండునోయని కత్తి మెడపై నిడి భిల్లులు సింహనాదము సేయ భిల్లాంగనలు చప్పటలు చఱవ నొక్క వ్రేటును వైచెను. ఆ వ్రేటుతో బాలునిశిరము తెగి నేలఁబడవలసినదేకాని యాకత్తి వాని మెడ రెండవవైపునకుఁ దప్పించుకొని నాయేఁటు వానికిందగులదయ్యె. అంత నాకుమారుఁడు స్మృతి దెచ్చుకొని చేతులు జోడించి గండాభిల్లుఁజూచి నమస్కరించి, "అయ్యా! నన్నేల యీదేవతకు బలియిచ్చెదవు. మా తల్లికి నేనొక్కఁడనే

కుమారుఁడను. ఈనడుమ మాచిన్నతమ్ముఁడు మశూచికము వచ్చి చచ్చినాఁడు. నేను మాయక్కనుజూచి పోవలయునని పునహానుండి వచ్చుచున్నాను. నేను తండ్రిలేనిబిడ్డను. మిగుల బీదతనము ననుభవించుచు దిక్కులేని నాకుటుంబమును బోషించుకొనుటకు నెక్కడనైనఁ బదిరూపాయలుద్యోగము సంపాదింపవలెనని పట్టెడాశతో మాబంధువుల నాశ్రయింప నిటు నిందూరు నగరమునకుఁ బోవుచున్నాను. నేనేమా యుద్యోగము సంపాదించి తమ్ముఁ బోషించునంతటి ప్రయోజకుఁడనగుదునని గంపంతకోర్కెతో నాతల్లి నాకయి యెదురు చూచుచుండును. నన్ను విడిచి యీపుణ్యము గట్టుకొమ్ము" అని ప్రార్థించెను. ఆ ప్రార్థనలు వినఁగొందఱు భిల్లులకును భిల్లాంగనలకును హృదయముల గరుణారసముదయించెను. కాని శాంతియాభిల్లున కాగ్రహముదయించి గురువునుజూచి "ఈపాపాత్ముని వదలవద్దు. వదలినచో దేవి కాగ్రహము వచ్చును. ఇదివఱకు మనమెన్ని పల్లెలు దోఁచిన మనము కట్టుబడకుండుటకీమె కారుణ్యమేకదా కారణము. కావున వేగమే తల తెగవైవుఁడు" అని పలికెను. పలికినతోడనే మనుష్యాకారము నెత్తిన వ్యాఘ్రమువంటి యాగురువు మనుష్యప్రాణములఁ దీయుటలోఁ జిరతరానుభవముగల తన కుడిచేతి నెత్తి శిరము దేహమునుండి తెగవైచుటకుఁ గత్తిమెడపైఁ జేర్చి వాటముఁజూచి పాఱల ఖడ్గము నెత్తెను. అందఱు జయ భగవతియని" యని యరచిరి. ఆబాలుఁడు కనులు మూసికొని రామ రామయంచు మెడపైఁ గత్తిపడినదనుకొనెను. అంతలో

మూఁగిన మనుష్య సంఘమునందు, వచ్చెవచ్చె మరాటీదండు మరాటీదండు, అని మహాధ్వనులు వెడలెను. వెంటనే ప్రాణములకై వెరతెంచు వారును బాణములకై పరుగులెత్తు వారును, విండ్లుచేఁబూనువారును జెండ్లవలె రాళ్ళుపట్టు వారునునై భిల్లభిల్లాంగనా బృందము చిందరవందరయయ్యెను. ఈసమయము మరాటీదండు వారిపైఁబడఁ దత్సైన్య ముఖమున నుత్తమ తురంగముపై నెక్కి భిల్లులకు ప్రళయ రుద్రునివలెనున్న రాధాకాంతరావును, కుమారస్వామివలె వెనుకనున్న శ్యామ సుందరదత్తును గానఁబడిరి. గురువు ఖడ్గమును దాని క్రిందఁ బెట్టుకొని సాతీపోవుటయుఁ గొందఱు భిల్లులు గురువుగారి మార్గమునవలంబించుటయుఁ మిగిలిన యోధులు మరాటులపైఁబడి యెదిర్చి కొంతసేపు దూరమునుండి శిలావర్షము గురిపియుఁ గొంతవడి యమ్ముల వానలు వర్షించియుఁ గొంత సేపు ఖడ్గాఖడ్గి పోరియుఁ హోరాహోరిగా యుద్ధముఁ జేసిరి. తుపాకులు, పిచ్చికత్తులు, మొదలగు నాగరకపు పనిముట్లుండుటచే మరాటులు శత్రుసంహారమున నెక్కువ సులువుగల వారై మోటకయ్యముసేయు భిల్లులఁ దోలిరి. వీరశిఖామణి యగు రాధాకాంతునకు వీఁపుపై నొకకత్తి పెట్టు గాయము తగులుటయు, నీదుఃఖముపశమింప శ్యామసుందరదత్తుచే భిల్ల నాయకుఁడగు గండాభిల్లు పట్టుబడుటయు ననురెండుకార్యము లీయుద్ధఫలితములు. వృద్ధుఁడగు రాధాకాంతునకుఁ దగిలిన గాయము మహాయుధమైన దగుటచేఁ బట్టఁదగిన వేదనము జరగ దని దత్తాత్ముఁ శోకపడి చే యుంచి తగుపరివారముఁబిచ్చి

ముందుగా నిందూరు నగరమునకంపి తాను వెనుకనుండి దొంగను దీసికొనివత్తునని చెప్పి యాతని కంపెను. యుద్ధము జరుగుచుండఁ గొందఱు భిల్లులు బలియీయఁబడువారు వృక్షములకుఁ గట్టఁబడ్డ వారినికట్లు తొందరపాటుగా విప్పి బఱబఱ లాగికొనిపోయిరి. శ్యామసుందరదత్తు గండాభిల్లుని వెంటఁ బెట్టుకొని నలుగురు సేవకులతో మెల్లమెల్లగఁ బయనము సేయుచుఁ గడుమన్నెములను, పర్వతప్రాంతములను దాఁటి రెండు దినములకు మునిఋషియున్న కుటీర సమీపమునకు వచ్చి సాయంకాలమైనందున నచ్చట విశ్రమింపఁ దలఁచెను. దత్తుతోనున్న నలువురి సేవకులలో నొకఁడు గండాభిల్లునకుఁ బరిచితుఁడుండుటచే వాఁడతనితో నపుడపుడు సగము వినఁబడి వినఁబడకుండునట్లు మాటలాడుచు జాలిగల్గునట్లు కన్నీరువిడుచుచుఁ దన్నుఁ జెఱనుండి విడిపింపుమని బహువిధములఁ బ్రార్థించెను. కాని కత్తెరబోనువలె దత్తుఁ దక్కిన భటులు నుండుటచేఁ బ్రత్యుత్తరమిచ్చుటకుఁగాని చెఱనుండి వానిని విడిపించుటకుఁగాని యాబంట్రోతునకు వీలులేదయ్యె. గండాభిల్లు తన మరణమింక నిశ్చయమనియు నేచెట్టునకో కట్టి తన్నహల్యాబాయి యురి దీయుననియుఁ గడువిచారగ్రస్తుఁడై చచ్చిన పులివలెనుండి యేపని చేయుటకు వీలులేకుండఁ జేతులువిఱిచి కట్టఁబడినందున నప్రయోజకుఁడై యుండెను. ఇందూరునగర మొకక్రోసు దగ్గఱకు వచ్చినకొలఁది తనమరణ మొకదినము సమీపమగుచున్నదని గండాభిల్లు రోదనము సేయుచుఁ దానుజేసిన పాపములను, నరహత్యలను, రాజద్రోహములను దలంచి వెంగబెట్టుకొని నిద్రాహారములఁ

గై కొనఁడయ్యె. గండాభిల్లు చేఁజిక్కినవార్తవిన్న వారం దఱు సంతసించి పండుగ జేసికొనుచుండిరి. ఈ దొంగను శ్యామసుందరదత్తు ఋషి కుటీరమునుండి కాలుసేతులు గట్టి నలుగురు సేవకులను జుట్టు కావలి పెట్టి జామున కొక్క రిని మల్హారరావుని యానతిచ్చి తానొక వెలుగున నొక మంచ ముపైఁ బండుకొనెను. అంతట ఋషి యాతనితో, "నాయనా! యీపాపాత్ముఁడు దొరికినందుకు దేశమంతయు సంతసించు చున్నారు. వీనిని వేగముగఁ గడతేర్పుము. ఈ కార్యము చేసి నందుకు నీకీర్తి శాశ్వతమై యుండును. ఈదురాత్ముఁడు ప్రజలను బెట్టిన క్షోభ యింతంత కాదు. వానియసురు నేఁడు తగిలినది కాఁబోలు." అని ముచ్చటించెను. "ఇది మీ యాశీ ర్వచనము. మాకు హోల్కారు వంశమునకు మేలు సేయఁ దలఁచు మీ రెందుకు సేయరాదు? ఇది మీచలువ కాదా?" యని దత్తుత్తరము చెప్పెను. ఆసమయమున నొకతురక వెదకికొనుచు వచ్చి "అయ్యా, యిచ్చట శ్యామసుందరదత్తుగారున్నారా" యని యడిగెను. దత్తు తత్తరపాటుతో లేచి, "అబ్దుల్ నబీ యేమి యిప్పుడు వచ్చినావు? తొందర లేమైన నున్నవా?" అనియడుగ, "మహారాజా! తొందరలు లేవు రాణీగారు మీకు హుకుము జారీ చేయించినారు. అది తెచ్చినాను" అని చెప్పి యుత్తరముఁ జేతికీయ నాజాబును దత్తు చదువుకొని, పాప మింత త్వరగా పండియగునని నేఁ దలఁచలేదు. అని యుత్త రమును మడుచుచుండెను. ఋషి యది యేమని యడుగు చుండఁగనె దత్తు లోపలికిఁబోయి ఋషిని రమ్మనిపిలిచి గండా

భిల్లును మేలుకొలిపి యి ట్లనెను. "ఓయీ! మహారాణీ గారిట్లుత్తరము వ్రాసినారు. చదువుచున్నాను విను. "గండా భిల్లు నిటకుఁ దీసికొని రానక్కఱ లేదు. భిల్లులు, బిడారులు, గాండ్లు మొదలగు వనవాసు లింకముందెట్టి ద్రోహము సలుపకుండ బుద్ధిగలుగునట్లు వారికందఱకుఁ జెప్పి వారికి భయము గలుగునట్లు చెట్టునకుఁ గట్టి గండాభిల్లును శేషదయామున నురి తీయవలయును" అని వ్రాసినారు. గాబట్టి నీ మరణము" అని కఠినముగాఁ జెప్పి తనకుఁ గొంచెము కన్నుగు పడమిచే నం నుండ లేక వెలుపలికిఁ జని పండు వెన్నెలలోఁ బచార్లించెను. గండాభిల్లు ఉత్తువచనములు విని సిగ్గుబడినవాని చందమున కట్టుబొమ్మయై యెప్పుడే చచ్చినట్లుండెను. తరువాత ఋషి వానిని గొంత యోదార్చెను. ఆ పండు వెన్నెలలో నాఁటి రాత్రి దత్తునకు గండాభిల్లుయొక్క మునుపటి వృత్తాంతము దెలుపవలసి వచ్చినందుకు విచారమేకాక పాతికన విచా రము గూడ జ్ఞప్తికి వచ్చెను. ఆనాఁటి పూర్ణ చంద్రదర్శన ముచే దత్తుయొక్క మోహావస్థ నుబ్బ మాటిమాటికిని ప్రేరితమగు మహా మోహతరంగము లున్నతములగుటచే హద్దుమీఱెను. కమలయొక్క ప్రథమదర్శనమును వృషభాసవారి మును మొదలగు నాఁటిపనులెల్లఁ గన్నులకుఁ గట్టినట్లునాఁ గనఁబడి దత్తున కించుక సేపు గండాభిల్లుపై నుండిన కోప్ప రాజ భక్తినిగూడ మఱపించెను. అందుచే చిత్తనైర్మల్యంబు చెడి నందున నాతఁడు లేచి జాగ్రతగనుండుమని సేవకులతోఁ జెప్పి వానిని ఋషికిప్పగించి తనకుఁ గమలాదర్శనమైన స్థానమునకుఁ జనెను. అరిగి "హా! సుందరీ! హా కమలా! నీవెంత యల్పా యుష్మంతురాలవైతివే! వృషభము బారినుండి తప్పించుకొం

టివి గనుక చిరకాలజీవి నగుదు ననుకొంటినిగాని యింతలో నిట్టిబాపస్మరణము గలుగునని తలంపనైతిని. నీవు స్వర్గమునకుం బోవుచు నా హృదయమును నపహరించుకొనిపోయినావు. నన్నుం గూడ నీ సాన్నిధ్యమునకు కేలకొనిపోరాదా? నిన్ను జూచిన కన్నులతో నింకొక కన్యను జూడఁ జాలను. నిన్నుఁ దలఁచిన మనసుతో నింకొక కన్యను దలఁపఁజాలను" అని విలపించి యూరంట లేక "ఇచ్చట నొకదాని నిమిత్తము నేనెద్దును వాఁడి కోలలచేఁ గూల నేసితిని. ఇచ్చోటనే కదా నిన్ను సందిటం గదియం బట్టి నాకనుసార నీ మొగము రెప్పవాల్పక చూచుచు నిన్నుఁ గూర్చుండఁ బెట్టితిని. ఇందే కదా నీవు నన్ను వాలుచూపుల జూచి నా కాంక గొల్పితివి" యని యానాఁటిచర్య లెల్లఁ దలఁచి యాయాస్థానముల కరిగి కూర్చుండుచు, లేచుచు, బన్వళించుచు మన్మథబాణప్రహారముల కోర్వక విహరించుచుండెను.

## పదునొకండవ ప్రకరణము

ఇట్లు శ్యామసుందరదత్తు విచారించి ప్రొద్దుచూచు నప్పటికి రమారమి జాము రాత్రి యుండెను. అందుచేఁ జాల నాలస్యమైన దని యెంతసేపు విచారించినను గతజలసేతుబంధనము గాని ప్రాప్తినొందదని కమల మరల రాదని యెఱింగి ఋషి కుటీరాభిముఖుఁడై చనెను. చనుచు మార్గమధ్యమున "తెల్ల

వారుచున్నది. గండాభిల్లును నే నరి దీక్షింపవలెను. శాబోలు! ఈవఱ కెన్నఁడు నిట్టిదారుణ కార్యము నేనొనర్చి యుండలేదు. ఈపని నాపాలఁ బడినందుకు నాకు మిగులఁ గష్టముగనున్నది. నేనెట్లు చేయుదును. అయినను రాజభక్తియుఁ బ్రజాక్షేమముఁ జూచి యిద్దురాత్ముని జంపవలె. రాణిసెలవు తప్పదుగద" యని తనలోఁ దాన వితర్కించుకొనుచు నేవృక్షమునకు ద్రాడువేయించి యురిదీయింపఁదగునని యోచించుచు నిరుప్రక్కలనున్న మహావృక్షములఁ బరీక్షించుచు నడవ సాగెను. ఇట్లు నడచి యొకకొంతసేపటికి ఋషికుటీరసమీపమునకు నరుగుదెంచి యాగుమ్మముముందరఁ గన్ను చెదురునట్లు కుంకుమనీటివలె నున్న రక్తమును జూచి యాశ్చర్యమునొంది నిర్ఘాంతపడి నిలుచుండెను. నిలిచే నలుదెసలు బరికింపఁ దన సేవకులలో నొకని శిరమొక వైపునను మొండెమొకవైపునను బడియుండుట దనకన్నులకగుపడఁగా దత్తుచిత్తము తత్తరమంద లోనికిఁజనియెను. చనినతోడనే వానియాశ్చర్యమే మని చెప్పుదును. కుటీరములోఁ దనమువ్వురు సేవకులుగాని గండాభిల్లుగాని కనఁబడరైరి. కాళ్లు చేతులు వెనుకకు విరుగఁగట్టఁబడుటచే మాటలాడనేరక యొకమూలఁ బడియున్న ఋషిని మాత్ర మతఁడు చూచి మెల్లఁగా వానిని లేవనెత్తి యొకచోటఁ గూర్చుండఁబెట్టి కట్లువిప్పి నోటనున్న గుడ్డనూడఁదీసి యావైచిత్ర్యమునకుఁ గారణమడిగెను. ఋషికొంత సేదదేరి నీరసముతో నిట్లు చెప్పెను "నాయనా! నీవేలయడిగితివి? నీకొంత నాకొంతఁ

గూడఁ దీసితివి. నీవెట్టి పాపపుగడియల బయలు దేరితివో నీవు పటీరపు వెడలిన తోడనే నలువురుభిల్లులు మాపైఁ బడిరి తరువాత నేమిచెప్పుదును తండ్రీ! విశ్వాసముగల శూరశిఖామణి యగు నీసేవకుఁడు కావలి కాచుచు వారి నెదు ర్కొన వారొక్క మహాఘోరమును వానిని దమ కత్తికి నెర జేసిరి. తరువాత, నే నెదిరింపఁ బోవ నన్నా ట్లుచేసి చేతిలో నున్న గండాభిల్లును వదలించుకొని పారిపోయిరి. వారరిగిన కొంత సేపటికి నీ మువ్వురు సేవకులు మోఁకువదెచ్చు కొని నాస్థితిని జూడకయె దొంగ లేఁడని భయపడి యెక్కడికో పరుగెత్తిరి. ఇంత మించ నేనే మియు నెఱుఁగను. నాకీటీంపుము నిట్టిపని జరిగినందున నన్ను గూర్చి ప్రజ లేమని చెప్పుకొందురో యని నాకు దుః కొట్టినట్లు న్నది. పాపము పుణ్యము పరమాత్మునకుం డెఱుఁగును." అని ఋషి తన వాక్యమునమాప్తము జేయునప్పటికి, దత్తును విచారాశ్చర్యసముద్రమగ్నుఁడై తనజీవము సమాప్తమయ్యె నని యెంచుకొనెను. ఈ సేవకులె వానిని విడచిపో భిల్లు లేవద లించుకొని పోయిరోయని సంశయ మొందుచుఁ దనభవిష్యదభి వృద్ధి యనువృక్షమునకుఁ బిడుగుపాటువలెఁ దటస్థించిన యీకా ర్యమునకు వగచుచుని శ్చేష్టుఁ గోడకుఁ జేరఁబడి కూరుచుండి యిట్లువితర్కించెను. "హా దైవమా! ఎంతపని జరి గించితివి! నా కావిరహతాపము నాపాపముచేఁ గలిగినది కా బోలును! పెండ్లయిన దీని విడిచియేమరితిని? ఏ మొగము బెట్టు కొని యింక నిందూరుపోవుదును. ఏ మొగముబెట్టుకొని యహ ల్యాబాయి రాణిమొగము జూతును. నే నేమో సంస్థానమంత

పాదములు విడువక యున్నవారికి హెచ్చరికఫుట్టఁ బలికి యభయహస్తము నిచ్చు ఋషియొద్ద సెలవు గైకొని పయనము సాగించెను. ప్రాణములకు మానములకు గూడ హానికరమగు పనిలో నాచే జేతఁ జేసికొంటి ననియు రాధాకాంతరావునకుఁ గూడఁ దన మూలమున నప్రతిష్ఠ సంఘటిల్లు ననియు, రాణీ యిట్టి విషయమును దన్ను క్షమింప దనియు, నెఱింగి యారంభమున విచారభారము మెండగుటచే నాహారనిద్రలు మాని హెచ్చరిక లేమిచే నడక చకచక సాగక మెల్లగా నిందూరుపురి కరుగుచుండెను. త్రోవలో సేవకులలో నొకఁడు దత్తును గనుఁగొని "అయ్యా! మన ప్రాణముల రక్షించుకొనుట కుపాయమొకటి కలదు. దొంగవారిపాలాయెనని చెప్పుటకు మాఱు దొంగవారి దీసితిమని మనము చెప్పినచో మన ప్రాణములు దక్కును."

అన శ్యామసుందరుఁడు తన సుందరముఖమున మందహాసము లంకరింప "ఓయీ పిచ్చివాఁడ! అబద్ధమాడినచో దాగునా? భగవంతుని యెదుట మనము దాఁచఁగలమా? అనృతంబై కెన్నఁడైనఁ బొక్కకపోదు. ఆయాలోచనఁ గట్టిపెట్టి మన మందఱము నిజమొప్పుకొందము. పైన దేవుఁడున్నాఁడు." అని మందలించి యెడతెగని పయనముతో దత్తు మహానగరమున దనసోదరి నైనఁ జూడక యానాటిమధ్యాహ్నము రెండున్నర యామములకు నిందూరునగరముఁ జేరి రాధాకాంతుని యింటికిఁ జనక తన ప్రమాదము నెవ్వరితోను జెప్పకొనక మృత్యుదేవత కెదురు సన్నాహము సేయువాని తెఱంగున నతిధైర్యముతోఁ గోటకుం జని రాణికిఁ దన రాక నెఱుఁగఁ జేసెను. రాణి

యుత్తరువు ప్రకారము లోనికిం జని శ్యామసుందరుడు నిలిచిన తోడనే యామె యాత్రముతో, "గండాభిల్లు నుఱి దీసినావు? కాదా? చచ్చునప్పుడు వాడేమన్నాడు? భిల్లులకు బుద్ధి చెప్పితివా" యనియడిగెను. ఆమాటలకుఁ బ్రత్యుత్తర మంతటి యాత్రముతో నీయక కొయ్యవలె నిలువంబడియున్న దత్తుఁ జూచి యామె, "ఏమిది పలుకవు? వాఁడేమనినాఁడు? చెప్పవేమి?" యని తొలుతకంటె నెక్కువ యాత్రముతోడను, నెక్కువ వేగముతోడను దత్తునుబలుకరించెను. అంతట వారిట్లు మాటలాడిరి.

దత్తు—(చేతులు జోడించి) అమ్మా! యే మని చెప్పుదును? గండాభిల్లు పారిపోయినాఁడు.

అహల్య—(చెవుల సీసము వడుచున్నట్టు మొదలు చుక్కతగిన తప్తలోహమువలె దుర్నిరీక్ష్యయై) నీవింకఁ బ్రాణములతో నుంటఁగనే?

దత్తు— నేనీ వాతఁ దెలిసినవారికి విన్నవించుటకు జీవచ్ఛవమునై యున్నాను.

అహ—ఓరీమూర్ఖుఁడ! రాజద్రోహీ! జస్వంతరావు ప్రముఖులతో గూడి రాధాకాంతరావు కష్టపడిపట్టుకొన్న దొంగలను లంచములు గ్రహించి వదలిపెట్టి దొంగపారిపోయెనని చెప్పుటకింను బ్రతికియున్నావా? ఇంతదూరము రానేల? అచ్చట నెందుకు నీవు పొడిచికొని చావవైతివి? నీ ప్రాణములు నీకు దక్కనిత్తు ననుకొంటివా? యేమి పశువా?

దత్తు—అమ్మా! అది నా రాజద్రోహమువలన నైనది గాదు. పొరపాటు.

అహ—ఛీ! సిగ్గు లేకసంకిలు చెప్పుకొనెదవేల? పొరబాటా? చేఁజిక్కిన యపరాధిని జేతులారా విడిచితివి పొరబా టెట్లగును? ఛీ! నా యెదుటనే మొగము జూచి నేను భరింపఁజాలను. నీయాయువు నేఁటితో మట్టు మింపనది. నామంచితనము నాయాదరణము నీకు విషమైనది. ఓరీ, ఎవరురా. వీని చేతులు విఱిచికట్టి వీనిని బట్టుకొమ్ము. రాధాకాంతుని బిలుచుకొని రమ్ము,

ఇట్లు మొత్తని లేడిపిల్లపై సుంకించు నాఁడుసింగము వలె రూక్ష వచనముల శ్యామసుందరదత్తున నొప్పించి వాని నొకభటుని యాధీనము జేసి రాధాకాంతాదుల యాగమనమును నిరీక్షించుచుండెను. దత్తుంతో గూడవచ్చిన మువ్వురి సేవకులలో నొకఁడు రాధాకాంతుని గృహములకుఁ జని జరిగినవృత్తాంత మంతయు వాని కెఱింగించెను. దత్తును దనకుమారునికంటె నెక్కువ ప్రేమతో బెంచుకొనుచున్న రాధాకాంతుఁ డాయా కస్మికదుర్వార్తచే నడుము విఱిగినట్లు దుర్బలుఁడై తానునాటిన మొక్క నిర్మూలమగు సమయము వచ్చినదని విచారింపఁదొడ గెను. ఇంతలో రాజసేవకులు వానిని బిలువవచ్చుచుండెను. ఆతండు పయనమైతనగాయువు బాధపూర్ణమగుచుండఁగ నందున మెల్ల మెల్లగాఁ జేతికఱ్ఱసాయమున నడుచుచు సంతిపురముఁ బ్రవే శించి నరకాసుర సంహారణోన్ముఖ యగుసత్యభామవలె వెలుఁ గొలుపుచూపులు గలయహల్యను గని యుచితనమస్కార

యభిప్రాయముకాదు. ఈ కుట్రలో నింకనెందరు చేరిరో విచారణచేసి వారి కందఱకు సంఘుచరణము గల్పించుట కర్తవ్యము. కాబట్టి విచారణ సల్పుమని గోమాజీరావువద్దకు వీని నంపెదను. శ్యామసుందరా! నీసాక్ష్యమును నీవు దెచ్చుకొనుము. ఓరీ! భటులారా! వీనిని చెరసాలలో నుంచుడు.

రాధా—అమ్మా! నేను జామీనుండెదనాతని వీనినప్పగింపుడు.

అహ—జామీను గీమీను పనికిరాదు విచారణకావలయును. వీరందరు నిట్లు నరుగుడు.

అనియామె లేచి మనస్ప్రతీక్షండగును జనిరి. శ్యామసుందరుఁడు మరణదండన పదివినవాడును మనోధైర్యము విడువక నిశ్చలుండై యుండి రాధాకాంతుని వీడ్కొని భటులు గొనిపోవ చెఱసాలకుం జనెను. రాధాకాంతుఁడు కన్నీళ్లతో నాతని విడిచి యింటికిం జనెను.

## పండ్రెండవ ప్రకరణము

గంగాభిల్లు శత్రువులచేతం జిక్కినాండని విన్నది మొదలు విచారణసమయమునం దమకుట్రను భిల్లులు బయలుపెట్టుదురేమోయనియుం దమకాపుండగు గంగాభిల్లు నిష్కారణముగ నురిదీయబడుననియు బెంగగొని కాలుగాలిన పిల్లుల

వాతఁను దలఁచుకొనుచుంటి. ఏమి యీ వైచిత్ర్యము! ఈ వృథావిచారముతోఁ గాలయాపన యేల? త్వరగా నాకు స్వర్గలోకసుఖము గనులాదర్శనమును జేయింపుము. అని వేఁడుకొనుచు నొకమారు కన్నీరు పెట్టుకొనుచుఁ బరితాప మొందసాగెను. శ్యామసుందరునివంటి బుద్ధిశాలియు బలశాలియుఁ దమపక్షమునకు వచ్చినేని దమకే తక్కువ నెగ్గునని యాతని నెట్లయినఁ దమవైపుఁ ద్రిప్పుకొనుటకు జస్వంతిరావు ప్రముఖులు ప్రయత్నములు చేయఁ దలఁచి కారాగృహాధికారి తమమిత్రులలోనివాఁడే యగుట జాము రాత్రి యైనతరువాత జస్వంతరావు రహస్యముగఁ జెఱసాలయొద్ద కేఁగి జీవచ్ఛవమువలెఁ బండుకొని యున్న దత్తుఁజూచి జాలినొంది మెల్లగ వానిని లేపెను. దత్తు లేచి తనయెదుట జస్వంతరావును జూచి యది కల యేమో యని కలవఱపడి నిజమని తరువాత నెఱిఁగియతఁడక్కడకు వచ్చుట కాశ్చర్యపడెను. అంతట జస్వంతరావు వారిని బలుకరింప నారిట్లు మాట్లాడిరి.

జస్వంత—శ్యామసుందరా! రాజులను రాణులను నమ్మిన వారి బ్రతుకులు తుద కెంతవరకు వచ్చునో నీవు స్వానుభవముచే నిప్పుడెఱిఁగితివా? చలచిత్తులగు ప్రభుపిశాచముల సేవించుటకంటె ముష్టి యెత్తుకొని బ్రతుకుట మేలు. నిన్నుఁగూర్చి నాకు విచారమగుచున్నది.

దత్తు—నాకర్మమునకు రాణి యేమిచేయఁగలదు? ఆ నేను చేసిన యపరాధమునకు నేను దగిన శిక్ష ననుభవించుచున్నాను. ఆమె లోపము లేదు.

కాంతుఁడను జచ్చినఁగాని మనము నెఱవేఁడు. వారి కోడలను నేను బాధపెట్టుచున్నా ననియు నాకొడుకే నతని వివాహమాడఁడు ననియు నాపై నేరములు రాణిగారికిఁ జెప్పి లోకములో నా రెండుసంగతులను జాటి నాకపకీర్తి ఘటించినవారు. రాణిగారికంటె వారిమీఁద నాకెక్కువ కసి గలదు. అందు శ్యామసుందరునిపై నాకుఁ గలకోపమునకు మితిము లేదు. వాని నరిదీయించునట్లు సెలవీయవలెను.

గోమా—నే నిందు లేశమైన నన్యాయముఁ జేయ. నేను పిల్లలు గలఁవాడను. ముఖ్యముగ నూటికిఁబోయి న్యాయమే చేసెదను.

దౌల—మనలో మనకే యిన్ని భేదములుండఁగ మన మెట్లు నెగ్గఁగలము?

గోమా—అన్యాయముగఁ జంపినచో నామీఁదఁ బ్రజలకు గోపముండదా?

దౌల—సరే! నీయిష్టము వచ్చినట్లు చేయుము. నే నరుగుచున్నాను.

అని దౌలతరావు విసుగుతోఁ దనగృహము విడిచి పోయిన తరువాత గోమాజీరావు మొదట లోపల దాఁగియున్న యొకపురుషుని "ఖేతాళా! యిఁకరావచ్చును రా" యని పిలిచి తన ప్రక్కను గూర్చుండఁబెట్టుకొనెను. ఖేతాళసింగు హిందూస్థాన నివాసియగు రాజపుత్రుఁడు. ఇనుపకడ్డీలవంటి భుజములు గుండ్రని తలయుఁ బచ్చనిమొగమునను నీలికాంతుల నొసంగుకోరమీసములును వానియాకారము

భయంకరముగఁ జేయును. అతఁడు కూర్చుండ సభవారిట్లు మాటలాడిరి.

గో మో — సైన్యములీపాటికి నింబపురము వచ్చియుండునా?

భే తా — ఇంకను వచ్చియుండవు. ఈ సమయమున మహారాణా వారికి దేహమున నించుక భారముగనున్నది. అందుచే నాలస్యమైనది.

గో మో — శివనానా తప్పక పారిపోవును. అతనిదగ్గర విశ్వాసమే కాని బలము లేదు. మీరు తుకాజీహోల్కారునకు మాత్రమే జడియవలెను.

భే తా — అతఁడు నింబపురముమీఁదికి రాకుండ మీరు జాగ్రత్త పెట్టవలయును. నిన్ననో నేఁడో రాణావారు నింబపురము వచ్చి యుందురని తలంచుచున్నాను.

గో మో — నాకు వేరే పనియున్నది. నీవింకఁబొమ్ము. మరచిపోక నాసొమ్ము నాకిప్పించుసుమా?

అని భేతాళసింగు వీధియరుఁగుపై విశ్రమించు భైరవసింగును వెంటఁబెట్టుకొని తనదారిని బోయెను. అనంతరము గోమాజీరావు తనలో "నాకోరిక యెన్నఁడైన నెఱవేఱి యీ రాజపుత్రులు నింబపురముఁబట్టుకొని యహల్యాబాయిని బారఁదోలి తామే దేశమంతయు నాక్రమించుకొని నాకు మంత్రిపదమునొసఁగుదురా? నేనంతటి యదృష్టవంతుఁడనగుదునా" అని యోచించుచుండఁ దలుపు దోసుకొని వామన

భట్టు వచ్చి యెదుట నిలిచెను. ఆలోచనలు మాని నేత్రాల వానివైపుఁ జూడ వాఁడిట్లనియెను. "అయ్యా! ఆతఁ డేమియు లంచమిచ్చునట్టి స్థితిలో లేఁడు. వానికి బంధువులును లేరు."

గోమా—ఇచ్చువారు లేకేమి? సామాన్యజనములలో నతని బావ యున్నాఁడఁట. అతఁడు కీర్తి నదలి గూడ నెంతధనమైన నాకు లంచమిచ్చును. దత్తు ప్రాణానికేసము రాధాకాంతరావే లంచ మిచ్చెను. కాని నేను నాదగ్గర లంచము గ్రహింపను. అతఁడు నమ్ముదగినవాఁడు కాఁడు.

వామన—నేను సాధ్యమైనంత ప్రయత్నము జేసి మీకు రెండు వందలైన లంచము తెప్పించెదను. మీరు లంచము లేకుండ చేయుదునని ప్రతిజ్ఞ గైకొన్నారుగదా!

గోమా—ఏ మాత్రమైనను సరే కార్యము చేసికొం డఁదీసి కొనిరా. నీవింక పో. నేను నిద్రపోవలయును.

అని వామనభట్టునంపి తెల్లవారుదాఁక నిద్దుర లేక యిటు నటు పొరలుచు నెట్లో యా రాత్రి నాలుగుజాములు గడపి యుదయమునఁ బెందలకడ మేల్కొని రాణిదర్శనార్థమరిగెను. గోమాజీని బరమ విశ్వాసముగల యుద్యోగస్థులలో నొకనిగ రాణి పరిగణించుటచే నాతనికిఁ దగునాసన మొసంగి కూర్చుండఁబరిచి గౌరవించి పనియేమని యడిగెను. అంతట గోమాజీ లేచి "అమ్మా! రాజ్యమల్లకల్లోలముగ నుండుటచే నాకు నిద్రపట్టుటలేదు. యశ్వంతరావు ప్రేరణముచే రఘునాథరావు సైన్యమును వెంటఁబెట్టుకొని మనపై వచ్చుచున్నాఁడఁట!

అహ. ఏమీ! వచ్చుచున్నాఁడా! నీ కెవఁరు చెప్పిరి? నిజముగ తోఁచదు.

గోపా — అయ్యయ్యో! మీరు మాయమర్మ మెఱుఁగరు. శ్రీపీష్వా రఘునాథరావుగారు పినతండ్రికిఁ దగుబల మిచ్చి పంపినారు. మీరు తక్షణమే తుకాజీ హోల్కారును వారిపై కంపఁదగును.

అహ — తుకాజీని గాదు. రాధాకాంతరావు పంపుదును. ఈవేళ నీవు దత్తుపై వచ్చిన యభియోగమును విచారించి న్యాయమైన తీర్పు జేయుము.

గోపా. రాధాకాంతుఁడు ముసలివాఁడు అతఁడేమియుఁ జేయఁజాలఁడు. తుకాజీని బంపుట యుచితము. మీఁద మీచిత్తము.

అహ — ఎవరైన నేమి? విశ్వాసముతోఁ బని చేయవలెను. గాని నీవింకఁ బొమ్ము.

అని గోపాజీ తన యేలికయొద్ద నుచితప్రకారముగ సెలవుగైకొని నిష్క్రమించెను. రాణి రాధాకాంతుని బిలిపించి తగుసైన్యముతోఁ దక్షణమే పూనానగరమునుండి వచ్చుచున్న రఘునాథరావున కెదురుగఁ జని వానినోడించి రమ్మని యానతిచ్చెను. దత్తునకు మరణదండన తప్పించుటకుఁ బ్రయత్నించఁదలఁచుచున్న రాధాకాంతరావు పొరుగూరు పోవలసివచ్చినందులకును దత్తునకు సహాయము చేయలేక

పోయినందులకును చింతించి వెళ్ళుట కిష్టములేక తప్పక వారి వెంట వెడలెను.

## పదమూఁడవ ప్రకరణము

రాణిదర్శనముచేసి సంగతులు ముచ్చటించి గోమాజీరావు తిన్నగాఁ దనకచ్చేరికి వచ్చెను. కళాహీనమగు మొగముతోడగు దయాహీనమగు హృదయముతోడను దీనమొగమువలె వెలవెలఁబోవు తెల్లని వస్త్రములతోడను టక్కుటక్కరులును ముచ్చెల చప్పుడులు వందిమాగధులై తనరాక తెలియఁ జేయఁజేయ నౌకరుబంట్లుగాఁ బాలకీఁ విలాసార్థముగఁ బట్టుకొని కచ్చేరికి దయచేసిన కొత్వాలును జూచి బంట్రోతులు దండములు పెట్టిరి. అతఁడు కచ్చేరిలో సజ్జుచేయఁబడిన తనపీఠము నలంకరించినతోడనె నేరములు చేసినవారు క్రమక్రమముగ వానియెదుటికిఁ దీసికొని పోఁబడిరి. తనకు సహాయము నొసఁగఁదగిన రాధాకాంతుఁడు తక్షణమే యూరికిఁ జనుటయు శత్రుగణముతోఁ జేరి తనపైఁ గక్షవహించిన గోమాజీ తన్ను విచారణ సేయుటయు స్వయముగ రాణికిఁ దనపైఁ గోపముదయించుటయు నరసి దత్తు తనకు మరణము తప్పదని ప్రాణరక్షణార్థము ప్రయత్నముఁ గూడమానెను. శ్యామసుందరుని వానిగుణములను నెఱిఁగిన వారగుటచే నతని విచారణ జూడవలయునని నగరవాసులలోఁ బెక్కండ్రు కచ్చే

జేసిరి. ఋషి నారాయణ నారాయణ యనుచు పాదములు గూర్చుండ నియమించి యున్నతాసనముఁ గొత్వాలునకు సరాసరిగఁ దానును సుఖాసీనుఁడయ్యెను. అనంతరము వినయ విధేయతా పూర్వకముగ ఋషి నిగ్గాని కొత్వాలు మీకీ విషయమునఁ దెలిసినంతఁ జెప్పవలయునని ప్రార్థనయును ఋషి యిట్లనియె. నన్ను మీరు ప్రశ్న వైవలదు. భగవంతుని మొగముఁజూచి నిష్పక్షపాతముగ నేను జెప్పెదను. శ్యామసుందరదత్తు నా కుటీరమున చిన్నప్పుడు చదువు కలదు. నాతో రహస్యముగఁ గొన్ని కొన్ని యోచనలు చేయఁ బ్రయత్నించెను. దొంగ పాతిపోవుటలో దత్తు పొరపాటు పడెనో బుద్ధిపూర్వకముగఁ జేసెనో చెప్పఁజాలను. రాజభక్తి యతనికి విస్తారముగ నున్నదని నమ్మఁజాలను. పొరపాటు చేతనో బుద్ధిపూర్వకముగనో రాజద్రోహము జరిగెను. గనుక శిక్షకుఁ దగినవాఁడె యని నాకుఁ దోఁచుచున్నది. ఇతఁడు సత్పురుషుఁడని నాయభిప్రాయము. అని ఋషి పలుక "ఛీ! ఈ ఋషికూడ నబద్ధమాడు చున్నాఁడు. ఏమిది" యని దత్తు బిగ్గరగ నరచెను. "అయ్యయ్యో! దైవస్వరూపుఁడగు ఋషి యబద్ధమాడుచున్నాఁడని యనుటకు నీనాల్కయెట్లాడెను? మూర్ఖుఁడా నోరు మూసికొను" మని గోపాజీరావు దత్తును గదిమి యాయభియోగము నిట్లు సమాప్తము చేసెను ఓయీ శ్యామసుందరదత్తూ! నీయందమును నీవయసును జూడ నాకు మనసు కరుఁగు చున్నది. కాని నీచేష్టను, నీ స్థితిని వయసునకును దగినవి కావు. చిన్నతనమునందే యింతటి

కుట్రలు చేసినవాఁడవు. నీవు పెద్దవాఁడ వగుదువేని లోకములు ముంచివైచెదవు. అంతటి ధర్మస్వరూపురాలిని మోసముచేయుటకు నీమన సెట్లొప్పినది? ఋషిమాటలఁ బట్టి చూచిన సేవకుల సాక్ష్యము బట్టి చూచిన నీవపరాధివని నాకుఁ దోఁచుచున్నది. నీకిప్పుడు శిక్షవిధింపవలయును. అయినప్పటికి దత్తు వాని మాటల కడ్డము వచ్చి "అయ్యా! మీరు నాకు విధించెడు శిక్ష మరణముకంటె నెక్కువగ నుండదు. నేనందుకు సిద్ధముగ నుంటిని గనుక నేనెరింగిన నిజమందరముందుఁ జెప్పుచున్నాను. దొంగయు మనుష్యుని వంటివాఁడే. నీవును, జస్వంతరావుతోడను దౌలతరావుతోడను జేరి పెక్కుకుట్రలు సేయుచు నేమియు నెఱుఁగని వానివలె వేదాంతములు పలుకుచున్నావు. నీకుట్రలు నేనెఱుఁగుదును. నన్ను గోసినను రాజద్రోహము నాదగ్గర లేదు. నేను ఘనమైనచావు చచ్చుచున్నాను నీవు నీచమైన బ్రతుకు బ్రతుకుచున్నావు. ఎప్పటికయినను నీసంగతి వెలుతురులోనికి రాక మానదు. దంభము చిరకాలము దాఁగ" దని దత్తు జనులు విస్మయమును జాలియు నొందునట్లును గోమాజీరావు నిశ్చేష్టుఁడగునట్లు నిష్ఠురముగఁ బలుకుటయు సభయెల్ల నిశ్శబ్ద మయ్యెను. ఋషి వచనంబుల నమ్మి కొందరు శ్యామసుందరుఁడు దోషియని వాదింప వానిమాటలు విని కొందరు దత్తు నిర్దోషి యనియు మరణమున కనర్హుఁ డనియు నెంచి కొత్వాలు తీర్పు నియ్యక ముందే దత్తాతని గౌరవవచనములచే నొప్పించుటచే నతఁ డేమి విపరీతపు తీర్పు నిచ్చునో యని యోచింపఁ దొడఁగిరి.

విచారింపఁదొడఁగెను. లేఖను జదివి గోమాజీరావు బిట్టలుకతో బండ్లు గీటుచు గ్రుడ్డెఱ్ఱఁజేసి నాకు లంచము నిచ్చుటకు రాధాకాంతరావు ప్రయత్నము చేయుటచూచినారా! బుద్ధి పోయినను నేను లంచము దీసికొందునా? నన్నింతయవమానము నతఁడు చేసినందుకు నేను రాణితోఁజెప్పి దీసికొనఁదగినంత చర్య జరపక మానను. అనుచిత మయినయీ లేఖను వ్రాసి రాధాకాంతుఁడు తననీచబుద్ధిని గనబరచుకొన్నాఁడు. కాని నేను రాణివిషయమై యన్యాయము చేయుదునా? ముక్కుసూటిగఁ బోయెదను. నా సంగతి యెవ్వరెఱుఁగరు. అని పలికి తక్షణమే తీర్పు జెప్పనుద్యుక్తుం డయ్యెను చూడవచ్చిన వారందఱు చెవులు దోరబెట్టుకొని తీర్పునిసి సిద్ధముగ నుండ శ్యామసుందరుఁడు నిశ్చలహృదయముతో దనగతి! జెవులార వినుటకు వేగిరపడుచుండెను. అప్పుడు కొత్వాలిట్లు తీర్పు వినిపించెను. “ఓయీ! శ్యామసుందరా! నీవు చేసిన రాజద్రోహమునకు నీకు నేను మరణదండన విధించినాఁడను. రేపు సాయంకాలం నీ కురిశిక్ష యగు” ననిబంట్రౌతులనుజూచి వీనిని జెఱసాలకుఁ గొనిపొండని యానతిచ్చి వెంటనే సభాస్థానమును విడిచియాతఁడు రాణిచే దన తీర్పునామోదింపఁబడ జేసికొనుటకంతిపురికిఁ జనెను. తీర్పువిని జనులు రామరామ! హరిహరీ! ఎంత కష్ట మెంతకష్టము! అయ్యో! యనుచు విలపించి యొక్కరొక్కరుగ గోమాజీని నిందించుచు నిండ్లకుఁ జనిరి. అనవరతమగు మనోవ్యథ దొలఁగించి కమలను సందర్శించుసుఖమును త్వరితముగఁ జేకురఁ జేసినందులకుఁ గొత్వాలునకు మ్రొక్కుచు

శౌర్యసుసుందరుఁడు నొక్కవానిమనోధైర్యమునకు తనను గ వరపాటు లేనిచూపులతోడను రాజభటులచేఁ జెఱసాలకుఁ గొనిపోఁబడుచుండెను. అంతలో మహారాష్ట్రపురమునుండి దత్తు నొక్క సోదరియగు నానందబాయియు నామె మగఁడు మురళీధ రుఁడును వచ్చి వానిదురవస్థ విని విలపించుచుండె నింకను నానంద కడసారి తనముద్దులతమ్ముని జూడఁ గోరుటచే మురళీధరుఁడు త్రోవలో దత్తున కెదురుపడి యాతనిజూచి మనస్సును చెడి వగచి సోదరి కొకసారి వానిఁజూపుమని బంట్రోతును వేఁడుకొ నెను. తనసోదరి నట్టిసమయమునఁ జూచుట కిష్టము లేక దత్తు వలదని రాజభటులతో వాదించినను దయాళువులగు వారు వాని మాట ద్రోసిపుచ్చినగా వాని నానంద కడకుఁ గొనిపోయిరి. లావణ్యవర్షము గురియు తమ్ముని మొగము చిన్నబోవుటయు దీర్ఘబాహువులు వెనుకకు విరుగఁ గట్టఁబడుటయుఁ జక్కనితెల్ల వెండ్రుకలు జీబురుపడుటయు విచ్చుకత్తులతో రాజభ టులు వాని వెంబడించుటయుఁ గనుఁగొని యానందడెందంబు పగుల దుఃఖము పట్టలేక యోతమ్ముఁడా యని కేక వైచి మూర్ఛిల్లెను. తనలో సమానదుఃఖితుఁడైన మురళీధరునిచేఁ జేయఁబడిన శైత్యోపచారములచే నామె తెలివినొంది హా! తమ్ముఁడా! యెంతకష్టమురా నాయనా! నేనెట్లు బ్రతుకుదు నురా తండ్రీ! నీకుఁ బెండ్లివారు వచ్చినారు. వారితో నేమని చెప్పుదురా నాయనా! నా వరాలపట్టా! నిన్నుఁ జూచికొని నాముద్దులు ముచ్చటలు చెల్లునని మురియుచున్నానురా తండ్రీ! ఈపాపిష్టి యుద్యోగము నీచావునకు వచ్చెనఁటరా! ఇంతమందియుండ దేవునికంటికి నీవే కనఁబడితివంటరా! అని

పరిపరివిధముల గుండెలు బాదుకొని తల గోడకువైచి కొట్టుకొని యెక్కడనైన ముష్టి యెత్తుకొని బ్రతుకకుండ నీకీకర్మ మెందుకు వచ్చెనోయి! మీ బావను వేళాకోళము జేసెడు వారెవ్వరు బాబు! నాతో మాటలాడవేమిరా! నామీఁద గోపమా" యని గడ్డము పట్టుకొని బ్రతిమాలుచు ముద్దుబెట్టుకొనుచు నేడ్వసాగెను. "అక్కయ్యా! నాఋణము తీరిపోయినది. దుఃఖించినఁ గార్యములేదు. నేను నీవాఁడను గాను. బావా! ఆమె నూరడింపు నాకు సెలవిమ్ము. పోయెద" నని పలికి దుఃఖమాఁగక తానుగూడ సోదరిపడిలోఁ బండుకొని దత్తు పెద్దపెట్టున నొకమాఱు రోదనము సల్పెను. ఆదుఃఖము జూడలేక బంట్రౌతులు గూడ నేడ్చిరి. తుదకు రాజభటులు దత్తును దీసికొని పోవుటకుఁ బ్రయత్నము సేయ, నానంద దుఃఖావేశముచే నొడలెఱుఁగక "ఓరీ దుర్మార్గులారా! నాతమ్మునిఁ దీసికొనిపోవుటకు మీరెవ్వరురా? మిమ్మును జంపివైచెదను. నాయెదుటనుండి పొండి" యని విఱిచి కట్టఁబడిన దత్తుయొక్క చేతులను విప్పసాగెను. మురళీధరదాసును రాజభటులును వారించి యామెనొక మూలగదిలోనికి సాయము బట్టి యీడ్చుకొని తీసికొనిపోయి యందుఁ బడవైచిరి. తరువాత నానంద మూర్ఛిల్లిసందున నదియే దాఁటిపోవుటకుఁ దగుసమయమని దత్తు "బావా! నామీఁద దయయుంచి నేనిదివఱకుఁ జేసిన తప్పులు క్షమియింపుము. నాయాస్తి నామేనల్లునికి వ్రాసి నన్ను జ్ఞాపకముంచుకొనుము. మాయక్కను దయతోఁ జూచుచుండుము." అని బంట్రౌతులతో గుమ్మము దాఁటి వెడలెను. మురళీధరుఁడు వెనువెంటఁ జని "నాయనా నిన్ను క్షమి

యుంచుటకు నీస్వల్ప జీవితకాలమున నీదగ్గఱఁ గలిగిన తెలు[illegible]
లేవి? నాకుడిభుజము పడిపోవుచున్నది. [illegible] లే
నీవున్నావుగదా యని నిన్న నేను నమ్ముకొన్నాను. నీవు
నన్నొంటిగనే జేసి నీదోవను బోవుచున్నావుగదా? నా [illegible]!
నీయొం[illegible] [illegible] పాలు గా[illegible] [illegible] వచ్చినది." అని వి[illegible]
పించెను. అంతలోఁ భటులు వేగిరపడి గోమాజీ రా[illegible]
దత్తకపుత్రకు నచ్చుటఁ దెలిసికొని దమకు మాటవచ్చునని
యాదత్తుని చెఱసాలకుఁ గొనిపోయిరి. ఆదినమునన భోజ
నములేక యా[illegible] మురళీధరులు మహా[illegible]
రాణి దత్తునకు గోమాజీ విధించిన శిక్ష నంగీకరించెను.

## పదునాల్గవ ప్రకరణము

ఓసీ! సీతా! నీవు చెప్పిన కథలు మిగులఁ [illegible]
తితో నిండియుండును. ఇంత చిన్నతనములో నింతి[illegible]
ముల నెప్పుడు నేర్చుకొంటివి? ఒక పర్యాయము [illegible]
చెక్కిలగునట్లు నవ్వింపఁగలవు. మరియొక పర్యాయము
భోరున నేడిపింపఁగలవు. హాస్యశృంగారకరుణారసములు ని
సొమ్ములేయని తోఁచుచున్నది. నీవు వివాహముచేసికొని
నీయత్తవారియింటి కరుగుదువేని నేనెట్లుండఁగలను? అని ముక్తా
బాయి తన కెదురుగఁ గూర్చుండియున్న సీతాబాయి నిం
గూర్చి పలికెను. రాధాకాంతరా వప్పగించినట్టి మొదలు

దాసియగు సీతాబాయి రాణియెడలఁ దత్కుమారిక యెడల నత్యంత విధేయతతో నడచుకొనుచు సముయోచితముగ వారి చిత్తరంజనకరము లగు వినోదకథలఁ జెప్పి వారిచే శ్లాఘింపఁబడుచు వచ్చెను. మొదట నామె ముక్తాబాయికి మిత్ర మేర్పరచఁబడినను దనవాక్చమత్కారముచేతను వాక్చమత్కారమును మించుముఖ సౌందర్యముచేతను, ముఖసౌందర్యము నతిశయించు వినయాది సద్గుణసంపదచేతను రాణి హృదయమును గూడ నాకర్షించినందున రాణిగూడ నామె చెప్పుకథలను వినుచుఁ దనవిచారముఁ బాపుకొనుచుండెను. సీత దాసియనియు ముక్త యజమానురాలనియుఁ బేరే కాని వారిరువురు నన్యోన్యానురాగము గలవారై నెచ్చెలులై యొకరినివిడిచి యొకరు నిమేషమయినఁ దాళఁజాలక ప్రొద్దులు పుచ్చుచుండిరి. సీతపెట్టకుండ ముక్త యేపదార్థమును భక్షింపదు రాత్రులు తనతల్లి చూడకుండ ముక్త సీతను దనమంచముపైఁ బండుకొనఁబెట్టుకొనుటయు యౌవనాతిశయమువల్ల నుదయించుకోర్కెల నామెకుఁ దెల్పుటయుఁ గూడఁ గలదు. దాసి నంతదయతోడను సమానగౌరవముతోడను నాదరించిన స్వపరగౌరవతారతమ్య మెఱిఁగిన తల్లి యేమనునో యనుభయమున ముక్త తల్లియెదుట నితరుల యెదుట సీతను దాసిగాఁ జూచి యాంతర్యమునఁ జెలివలెఁ జూడసాగెను. అహల్యాబాయియు సీతను సామాన్యముగ దాసియెడఁ జూపు గౌరవముకంటె నెక్కువ గౌరవమును జూపుచుఁ బ్రేమము నూలుకొల్పుచు నామెకుఁ గొంత

రానీయక బహువిధముల నరయుచుఁ జిన్న చిన్న యంశములలో నామె యాలోచనముఁ గూడఁ గైకొనుచు నామెబుద్ధి మెచ్చుకొను చుండెను. ముక్తాబాయి పైనుదాహరింపఁబడిన పలుకులఁ బలుకుటయు సీత నవ్వుచు దీనికంతకు మీవయసే కారణము. నేను మిమ్ము విడుతునని భయపడకుఁడు. బ్రహ్మచర్యము తోడనే కాలము గడతేర్పవలెనని యూహించుచుంటినిగాని వివాహప్రయత్న మింతట తలఁపు లేదు. మీరు వివాహానంతరము నన్ను విడుతురేమో యని భయపడుచున్నాను సుఁడి యని పలికెను. ఆపలుకులువిని ముక్తకు శరీరమంతట గగుర్పాటుదయించెను. తలవంచుకొని సీతనుజూచి "నీకు బొత్తుగా భయములేదు. అప్పుడప్పుడిట్టిమాటలు నాకుజ్ఞాపకముచేసి నాకుఁ గలవరపాటు గలుగఁజేయు చుందువు. నీవావిషయమై యోత్తబోకు" అని మందలించి జస్వంతరావును నేను గలిసికొను భాగ్యమే నాకుఁ గల్గునేని మా యమ్మకు వానికి నిట్టికలఁతలు గలుగవు. దైవమా! మాకు సంయోగము గలుగఁ జేయువుగదా? అని చింతించుచు సీతతో నీక్రిందిసంభాషణము జరపెను.

సీత—అమ్మా! గంగాధర జస్వంతరావుగారు మీకుఁ దప్పక లభింపఁగలరు. చింతవలదు.

ముక్త—కోరికలతో నాకుఁ బనిలేదు. అది వ్యర్థమనోరథమని నేనెరుఁగుదును. విరోధముచే మాయమ్మ నన్ను మరియొకరిని వరియింపుమని నాకాజ్ఞాపించును. ఇష్టము గల వానిని విడిచి వేరొకనిం జేసికొనుటకంటె మరణము మేలు.

సీత.—నిజమే. అందుచేతనే కమలాబాయి పాపము దాంతరావును వరించుటకంటె మరణ ముచితమని యట్లు చేసినది. మీయమ్మగారి పాలనములో నిది యొక్కటియే ఘోరమైనకార్యము జరిగినది.

ముక్త—అవును. ఆమె కడు నందకత్తెయట! నిష్కారణముగఁ జచ్చినది. సరే చచ్చినవారిజోలి మన కెందుకు? నాకాసంగతులు చెప్పకుము. రాత్రి పీడకలలు వచ్చును. నీ వేదైన నొకవినోదకథ జెప్పుము. నీవు కథలను జెప్పి నాకో గ్యముఁ గలుగఁ జేసినందుకు ముందుముందు నీకు నేనొక యుపకారము జేసెదను. ఇది నా వాగ్దానముగ నీవు గ్రహింపుము. నీయందు నాకట్టిదయ గలదు.

సీత—(సంతోషముతో) అమ్మా! ఇది నాకొక్క వరము. సమయ మైనప్పుడు తప్పక యియ్యవలయునుసుఁడీ. ఈవేళ మీకు వింతయైనకథ జెప్పెదను. అమ్మగారు కూడ వచ్చి యాలకింపవలసినట్టి కథ. వారువత్తురేమో మీరు కనుఁగొందురా?

ముక్త—అమ్మగారు కథల నాలకించుటకు మనస్థిమితము గలవారు గాలేరు. రఘునాథరావు దేశము పైవచ్చుచున్నాఁడని తెలిసి వ మీఁదికి రాధాకాంతుని బంపినది. ఇంకను రాధాకాంతుని యొద్దనుండి యుత్తరము రాలేదు. అతఁడుగూడ శత్రులఁ గలసినాఁడని యీవేళ దుమారు బయలుదేరినది. రాజపుత్రులు నింబపురము మీఁదికి వచ్చుచున్నారనియు సైన్యముల నంపుమనియు శివనానాజాబులు

వ్రాసినాఁడు. లేఖను జూడఁగనే మాయమ్మగారికి గుండెలో రాయి పడింది. అదిగాక క్రొత్తహోల్కారొకఁడు మాజ్ఞాతి బయలుదేరినాఁడఁట. వానికి నేఁడో రేపో పట్టాభిషేక మగునఁట. ఇవి యన్నియు నీవేళ యుదయమునఁ దెలిసినవి. ఆమెకేమియుఁ దోఁచుట లేదు. ఇంతియేగాక గండాభిల్లను దొంగను విడిచినందుకు నొకని కీదినమున నురిశిక్ష విధించినది. ఆమె యాపని జేయించు చున్నది. అందుచేఁగథ వినను.

సీత——అమ్మా! యీ యదృష్టహీనుఁడెవఁడు? వాఁడు శిక్షింపఁబడవలసినదే.

ముక్త——నీ వెరుఁగవా? రాధాకాంతునింట నుండెడు వడుచువాఁడు. శ్యామసుందరదత్తు.

ఆమెవచనములు చెవులఁ బడినతోడనే సీత భీతకురంగమువలె బెదురుచూపులు గలిగి నాలుక కొఱుకఁబోయిన దానివలెఁ దడబాటు మాటలతో "హరిహరీ! ఆపిల్లవాఁడే" అని కూర్చుండలేక స్తంభము నకుఁ జేరఁబడెను. ఆమె యవస్థఁ గని ముక్త భయపడి, "ఏమిది? నీవు దత్తు నెఱుఁగుదువు? నీకింతవిచారమేల" అనెను.

సీత——అమ్మా! పాప మాదత్తు, నేనును, చిన్నతనము నందు మిగుల స్నేహితులము. దైవవశమున నిటవిడిపోయిన తరువాత నేను వీరియింట దాసినైతిని. అతఁడుద్యోగి యయ్యెను. చిన్నప్పటి స్నేహముచే మిగుల జాలిగలదు.

ముక్త—మనమేమి చేయఁగలము? రాజద్రోహము చేసిన దురాత్ముఁడు శిక్షాపాత్రుఁడని నీ విప్పుడేకదా పలికి నావు. నీ మాట నీవు నిలుపుకొనుము.

సీత—దాసి నగు నేను నామాట నిలుపుకొనఁ జాలను. రాజపుత్రిక లగు మీరు మీమాట నిలుపుకొనుఁడు. నాకుఁ గావలసిన సహాయముఁ జేసెదనని మీరిప్పుడే వాగ్దానముఁ జేసినారు కదా? ఇప్పుడామాట నిలుపుకొని మీయమ్మగారి తోఁజెప్పి నానిమిత్త మీదత్తు ప్రాణములు రక్షింపుదురా? ఆ మేలు నాకుఁ జేయుఁడు.

ముక్త—ఇది యసాధ్యము. రాజకార్యములలో మాయమ్మ నామాట వినదు నేనీపని జేయఁజాలను.

అని ముక్త సందేహవిముక్తయై పలుక సీత కను దమ్ముల మంచుబిందువుల చందమున బాష్పకణములు దిగజార దుఃఖావేశముచే ధైర్యము జార ఘోరున రోదనము సేయఁ దొడంగెను. అందుచె ముక్త జాలిగొని యెటయినఁ దన యావచ్ఛక్తి వినియోగపరచి తల్లి మనస్సు ద్రిప్పుదునని బయలుదేరి విచారగ్రస్తయై యున్న కాంతామతల్లియగు తల్లిం గనుంగొని యొకచోట మెల్లగఁ గూర్చుండి కొంత సేపటి కామెతో, "అమ్మా! రాజపుత్రులు నింబపురము నాక్రమించినారా?" యని పలికెను.

అహ ఆక్రమింపలేదు. రేపో యెల్లుండియో యాపని జరగునుఁ

ముక్త—అమ్మా! యీదినము నాదోషముగని యున్నది. నీవు శ్యామసుందరదత్తును—

అహ—తెలిసినది. చాలుఁజాలు! నీమనవిని గట్టిపెట్టుము. ఆ విషయమై చెప్పకుము.

ముక్త—అమ్మా! అట్లనవద్దు. వానిని బ్రతికింపుమని సీత నన్ను వేఁడుకొన్నది. నాముద్దు చెల్లింపుము.

అహ—నీకు భయభక్తులు లేవు. రాజకార్య విషయములలో నీకు జోక్య మెందుకు? ముక్కుపచ్చలారని పసిదానవు. నీవు నాకు రాజకార్యములలో నాలోచన చెప్పవచ్చితివా? ద్రోహులను నే నురిదీయింపక నీ సిఫారసువిని రక్షించినచో రాజ్యమునకు వైపరీత్యము తప్పక వచ్చును. నీ వెన్నఁడు నిఁకమీఁద నిట్టివంటి స్వాతంత్ర్యములఁ గైకొని నాకు నేవిషయమున నుపదేశముఁ జేయకుము.

ముక్త—అమ్మా! నేనుపదేశము చేయలేదు. నేను బ్రార్థించుచున్నాను.

అహ—ఆదాసి వేఁడుకొనుటయు నీవు వేఁడుకొనుటయునా? ఏమీ! కొంచెము దయతో నాదరించుచున్నామని దానికి నొడలు దెలియుటలేదా? దాని యోగ్యతయంతరమును రాణినగు నాయంతరము నెరుంగక సీత సిఫారసులు చేయ సాహసించినదా? జాగ్రత్తయని చెప్పు. ఆలస్యమయిన కొందరిందెండలో సిఫారసులు చేయుచుందురు. కనుక నీపూఁటనే వాని నురి దీయించెదను. నీతోవను నీవు పోయి చదువుకొనుము. నేనిట్లన్నానని విచార మొందకుము.

అని ముక్తాబాయి యుడుకుఁబోతుతనమును దుఃఖమును డెందమున సందడింపఁ జిన్నవోయి తల్లివద్దనుండి పోయి గంపంతయాసతోఁ దనకై యెదురు చూచు సీతతో నిరాశ గొలుపు నీపలుకులఁ దెలుప నామె విన్నఁబోయి విచారభారముచే నన్నము నీళ్ళు ముట్టక రోజుచుండెను.

## పదునేనవ ప్రకరణము

ఉదయగిరిశిఖరంబునఁ దళుకొంపుబంతిచాయల ప్రభాకర బింబంబు నేత్రానందకరమై పొడసూపి యజ్ఞానముఁ బాపు సద్గురూపదేశవాక్యములవలె నంధకారమును బాపుతనకిరణ సహస్రములచే జగమున కమితోపకారము నొనర్చెను. వ్యాఘ్రసింహాది క్రూరమృగములు చీఁకటి గుహలలో దాఁగి తమవేఁట కనుకూలముగఁ బగ లేటికరుదెంచె నని విచారింపఁ జొచ్చుచు ఆ సమయమునను మహాపురసమీపారణ్యమున నొకయున్నత పర్వతశిఖరముపై వేనవేలుజనులు చేరి మహా కోలాహల ధ్వనిఁ జేయుచుండిరి. ఏనుఁగుదంతములు నడవి కుంచికొమ్ములు నెమలిపింఛములు పలువిధములగు పూసల పేరులు మొదలగు ననాగరికతసూచించు నలంకారములఁ గైకొని భిల్లులు నాగరికత సూచించు వేషములతో గొందరు పురవాసులును మధ్యస్థితిలో నుండిన కొందరు కాఁపులును వచ్చి తత్పర్వతమున నాతురతతో నొకమహాకార్యమునకెదురుచూచుచుండిరి. పర్వతముపైఁ జల్లదనమును వెదఁజల్లు విశాలములగు పం

దిళ్లు వేయఁబడియుండెను. పందిళ్ళకు నలుదెసలను మంగళకర ముగఁ గట్టఁబడిన పచ్చని మామిడాకుల తోరణములతో దండలుగఁ గట్టఁబడిన నవపుష్పములును స్తంభములకు జతగ నాటబడిన కదళికాతరువులును దత్ప్రదేశమునకు శృంగారలక్ష్మిని రాజ్యలక్ష్మిని నాహ్వానము సేయుచుండెను. ఈకోలాహలముతో జనులు నుత్సాహభరితమనస్కులై యుండఁ గొందరు పెత్తనము వహించి సందడి సేయువలదని జనుల నాజ్ఞాపించుచు హస్తములయందుఁ దమకు నెవ్వరు నియ్యని యధికారముఁ దెల్పు కఱ్ఱఁ దాల్చి యటునిటుఁ దిరుగసాగిరి. అంతలో "నిశ్శబ్దముగ నుండుడు వచ్చుచున్నారు. వచ్చుచున్నారు జాగ్రత్త" యను పలుకులు వినఁబడఁ బ్రజలందరు వచ్చుచున్న యా పురుషునిపై గన్నులు నిగిడ్చి చూడసాగిరి. అప్పుడు ముందును వెనుకను నిరుగెలంకులను హస్తముల దండములు బూని వేత్రహస్తులు స్తుతిపాఠములు సేయుచునము చెఱఁబెట్టుటచే బల్లెమునుండి వచ్చిన లోభి బ్రాహ్మణులు స్వస్తి చెప్ప దుర్గంధభూయిష్ఠమగు నొక యడవియేనుగుపయి నమర్పఁబడిన ప్రాత యంబారిలో బాలీసునకుఁ జేరఁబడి యొకసుందరపురుషు డిరువదియారుసంవత్సరముల వయస్సు గలవాఁడు కూర్చుండి యొడనెడఁ దనరాకకై ప్రజలు గావించిన యలంకారములకు మెచ్చుకొనుచు వచ్చెను. అంబారిలో నాతని కెదురుగ నొక పల్లవిస్థూలకాయుఁడు కొన్ని రాజకీయవ్యవహారముల నాతనితో ముచ్చటించు నీ బాలుఁడు తలయూఁచుచుఁ గేలనున్న [illegible] ఖోందోమిన ఖడ్గము తళతళ మెఱయఁ దనభవిష్యద్భాగ్యము బందిళ్ళమధ్యమున నిలిపెను. వెంటనే దాలత

రావు మెల్లఁగా సంబాళించి యాబాలునింగూడ వినయముతోడను భయముతోడను నొకరత్నకంబళముపై దింపెను. దింపునప్పటికి భిల్లులు ఘీంకారనాదములు చేసిరి. పల్లెనుండి వచ్చినకాఁపులు భయముచే నొత్తిగిలిరి కొందరు మన క్రొత్త హోల్కారుగారు వీరే యని యాబాలుని జూడఁదొడఁగిరి. గండాభిల్లు తాంతియాభిల్లు వెనువెంట నడువ చోపుదారులు మనుష్యుల నొత్తిగించి మార్గము జూప, దౌలతరావొక హస్తమును హరిహర పాండ్యాజీయొక్క హస్తమును బట్టి తన్నునడిపింప బాలుఁడు వచ్చి సభాంతరమున వైవఁబడిన యొక వేదికపై నున్న చిన్న కుర్చీపైఁ గూరుచుండెను. దాని ప్రక్కనే సింహాసన మని యొక పెద్దపీఠము వైవఁబడి యుండెను అందఱును సుఖాసీనులైయుండిరి వారి సభ్యులందఱుఁ దమతమయాసనములపైఁ గూరుచుండ నంతట దౌలతరావు లేచి సభలో నున్నధ్వని నివారించి యిట్లు చెప్పెను. ఓహో! ప్రజలారా! మిమ్ముల నిక్కడకు నేను రావించిన కార్యము మీ రెఱుఁగుదురు. ఈ దినము సుదినములలో సుదినము. ఈయన మనయేలిక యగుహోల్కారుగారు. తనమనుమఁడు గతించినపక్షమున నీయననే పెంచుకొమ్మని మల్హారురావు హోల్కారుగారు మరణశాసనము వ్రాసిరి. ఈయన యున్నతమైనహోల్కారు కుటుంబమున నుదయించినవారు. ఆఁడుదాని యధమపరిపాలనములో నుండుట కిష్టము కరువు గల మగవారి కుండఁగూడదు. మీరీమహారాజుగారి పాదములు నమ్ముకొని యుండుఁడు. ఈయన ధర్మప్రభువులు. వెనుకటి హోల్కారుగారికి సన్నిహితజాతులు ఈయనను

భిల్లు మరికొందరు వ్రులు కరణాలుం జేరి రాజసింహాసనమునకు సాష్టాంగ నమస్కారమొనర్చి తమ కత్తులు పిడులు రాజున కందిచ్చి యందఱమూ ముగ్గం దమ రాతనికే లోంబడుటం దెలిపి "స్వామీ! మేము మా ధనమ్మును మీకిచ్చెదము. అహల్యను రాణిగా నెంచము. మేము మీకొఱకు హోల్కారు రాజ్యముకొఱకుం బ్రాణములు ధారబోయుదుము. దేశముల దోచుకొని యీమెతోం గత్తిగట్టి యుద్ధము జేసెదము. అని ప్రమాణముం జేసిరి. అంతట శాయాజీహోల్కారుమహారాజుగారు సింహాసనము విడిచి లేచి యిట్లనిరి. "కాపులారా! మీకందరకు సమస్త సుఖములు గలుగునట్లు మేము పరిపాలించెదము. అహల్యాబాయి కాలమునమీకుం గలకష్టంలన్నియు నశించెను. ఖర్చులకుసొమ్ము గావలయును గనుక మీరు పన్నులు త్వరగా దౌలతరావునకు హరిహరునకు జెల్లింపుం" డని దౌలతరావున జూచి నిన్ను మాసైన్యమునకు సేనాధిపతిగా నేర్పరచినాము. హరిహరుని జస్వంతరావును మంత్రులుగా నియోగించితిమి. గండాభిల్లు మన్నెసుల్తాను బిరుదముతో యుడవుల నేం జేసినది. మరియు నహల్యకు జాబు వ్రాయుము. ఇందూరునగరము; కోట, సైన్యము, రాజ్యము, ఖజానా, మాదత్తజనకు, లగు మల్హారురావువారి యాభరణములు మాకామె వారముదినములోపున నప్పగింపవలసిన దనియు నట్లు సమర్పింపదేని యుద్ధము సిద్ధమనియుం గలహ మొనర్చి దేసి ప్రాణములతో విడుచుట లేదనియు జీవితాశ గలిగిన క్షమునమా సొత్తు మాకిచ్చి

మా రాజ్యము నుండి మరి యెచ్చటికైనఁ గారిపో వలసిన దనియు, నామెకు వ్రాయవలసినది. శ్రీవారు సర్కారు వారికిని గ్వాలియరు ప్రభువులగు సింధియామహారాజు గారికిని మాకు సహాయము రమ్మని యుత్తరములు వ్రా యుడు ఇదివిూకని" యని యుచ్చరించెను. అంతలో గొండ భిల్లు పదునేడేండ్ల వయస్సుగల యొక సుందరుడగు బాలుని దెచ్చి మహారాజునకు మ్రొక్కించి "దేవా! మా తాంతియా భిల్లు వీనిని మార్గమధ్యమునుండి తీసికొనివచ్చినాడు. మా దేవతకు వీనిని బలిపెట్టఁదలంచితిమి కాని రెండుమూఁడాటంకములు వచ్చుటచే వానియదృష్టమున బలిమానితిమి. వీఁడు చదువు వ్రాత నేర్చిన వాఁడట. వీనిని దమయొద్దనుంచుకొని మా విషయము లగు పనులు జేయింపుచుండుఁడు" అని యాతనిని సమర్పింప మహారాజు బాలుసౌందర్యమునకు మెచ్చుకొని వానిని దాముంచుకొనుట కంగీకరింప నిదివరకు రెండుసారులు మృత్యుదేవతనోటనుండి బయటఁబడినందులకు సంతసించుచు నా బాలుఁడు హోల్కారువద్ద కరిగెను. తరువాత మహారాజు తననిమిత్తము వేయఁబడినగుడారములోనికి నీబాలకునితోడం గూడి వందిమాగధ స్తోత్రములతో జనియెను. కాఁవులు తమతమ గ్రామముల కరుగ భిల్లు లాయుధముల ధరించి యాపందిళ్ళలోఁ బండుకొని యక్కడికే తమభోజనములు దెప్పించుకొని భుజియించిరి. క్రొత్త హోల్కారుగారు పట్టాభిషిక్తులయినవార్త గ్రామములో తెలియుటతోడనే సైన్యమఖి [illegible] పెండ్లిళ్ళు లేని ఘోటకబ్రహ్మచారులు

బిడ్డలులేని గొడ్డుబోతులు, కొంపలుగాల్చుటలో నారితేరిన ప్రౌఢులు దారులం గొట్టువచ్చుదొంగలు, బందెపోటుంజేయు దోపిడిగాండ్రు నవలీలగ నరహత్యలు గావించుహంతుకులు రాజులక్ష్యములేనిగడేకారులు, మొండి బండలు, రాజుపై నాగ్రహము గలదురాత్ములు వెయ్యేల దుర్నీతిపరులందరు శాయాజీమహారాజు సైన్యమునం జేరియెపుడు దేశముగొల్ల గొందుమో యెపుడు స్త్రీలం జెఱంబట్టుదుమో యని కోరు చుండిరి అహల్యాపాలనము నిష్టము లేనివారికిం గూడ నీ సైన్యము జూడ నొకవిధమైన భయముదయింప సకలదోష ములు మూర్తీభవించి కొలువ నధికారము సేయుకలిపురు షునివలె శాయాజీసి వారెంచఁ దోఁచఁగిరి. ఇదియైన మరు నాఁడుదయమున హరిహరుఁడును దౌలతరావు నొకటిగ గూర్చుండి యిట్లుముచ్చటించిరి.

దౌల — ఓయీ హరిహర! జస్వంతరా వీపట్టాభిషేక మున కేమన్నాఁడు? నీవతని వదలి యిక్కడికి వచ్చినా వేమి?

హరి — జస్వంతరావునకు మనయీకార్య మిష్టము. అందుచే నతఁ డీవిషయమై మనతో మాటలాడునఁట. కాబట్టి యీవేళ రాత్రి మన మిందూనగరమునకు బోవల యును. ఇష్టమున్నను జస్వంతరావు నాశ్రయించి నేనుండి నచో నాకు నొకగవ్వయైనదొరకదు. అతఁడు దేశము దోచు కొనుటకు నొప్పుకొనఁడు. నీదయవల్ల నేను నాల్గుడబ్బులు సొమ్ము నార్జింపవలెనని యున్నది.

దా—నిజమే. అతఁ డిందులోన జేరినఁ బిదప రాణిని దరిమి మనమే భాగుపడుదుము చూడుము. నాకు ధన మార్జింపవలెనని లేదు. నిమాలాంబాయి విషయములో నాకు, రాణికిఁ గష్టవచ్చి సంపాసనన్నామె పాండివమూంబువకుఁ గసి దీర్చుకొనుటయే నామనోభీష్టదేశము పిల్లలుగలవాఁడనైన కానలసిన ధనము నీవు దోఁచుకొని స్వీకరింపుము. నిరాశంటి బ్రాహ్మణుల కిచ్చిన పుణ్యము

హరి—నీవు నాకు చేసినయుపకారమునకుఁ జాలసంతసించితిని. శూద్రులలో నిన్ను మించినవాడెవ్వఁడు లేడు సరే కాని యీచచ్చుముండాకొడుకను హోల్కారుగఁ జేసినావేమి? ఆనక వీడుమన నెత్తిని బేడరాయునేమో.

దా—ప్రస్తుతము వీనిని హోల్కారుగఁ జేసితినిగాని రాజ్యము స్వాధీన మయినతరువాత నీయపాత్రపుచచ్చువీనుగును సాగనంపి నేనే రాజ్యము గైకొందును. అంతవరకు నాయకా, వాని నేర్పరచితిని. ఇది రహస్యము జాగ్రత్త.

అని వారు సంభాషించునంతలో నొకకొత్తపురుషుడటకు వచ్చుటచే వారు తమమాటలు సమాప్తము గావించి మహారాజాగారున్నగుడారమువైపు వరిగిరి.

## పదునారవ ప్రకరణము.

“అమ్మయ్యా! నా ప్రాణము లిప్పటికిఁ జల్లబడినవే సీత. నేనదృష్టవంతురాలనుసుమీ” అని ముక్తాబాయి పలు

కుటయు, సీత గాత్రముతో, "అమ్మా! యేమి జరిగినది యెందుచేత మీరింత దృష్టవంతులు,? చెప్పవచ్చునేని నాకాసంగతి జెప్పుడము" అని ముత్తను వేగిరపెట్టుటచే నామెయిట్లని చెప్పదొడంగెను. "ఓసీ! సీత! నీవింకను నెరుఁగవే! యెరుగవా నిన్నరాత్రి మాయమ్మ సర్వజనశ్లాఘ్యమయినయొక కార్య మొనర్చెను. శ్రీగంగాధరజశ్వంతరావుగారు, దౌలతరావు, హరిహరపాండ్యాజీ మొదలగువారు దాదాపుగనూర్వురుగూడి యొకమందిరమున మాయమ్మపైఁ గుట్రలుపన్నుచుండిరి. ఆ సాయంకాలముననే మాయమ్మగారికి వాలు తీని యొకయు తరమువచ్చెను. ఆజాబులో వీరందరుఁ గుట్రలు పన్నుదురనియు జస్వంతరావుగారి వసంతగృహములో గలిసికొందురనియు వారింబట్టుకొనుట కదియె యదననియున్నది ఆజాబు చదువుకొని వీరావేశము నొంది యమ్మలు విండ్లుఖడ్గములు మొదలగునాయుధములతో మదగజేంద్రము నెక్కి నయనకల్హారములయారుణ్యమును జూచి పౌరులు భయకంపితులై పారవీరపురుషోచిత వాక్యములు దుర్మాత్ములగుండియలు జల్లుమనఁజేయ బయలుదేరెను. బయలుదేరి యాకస్మికముగఁ దనపైఁ గుట్రలు పన్నుచున్న నరాధములతోఁ టఁ జేరి కవాటములుబలిమిని ఛేదించి యావసంతగృహమున వసంతజయంతకాంతుఁడగు జస్వంతుని, వాని చెలిమికాండ్రనుఁ గొందరను జూచి వారిలోఁ బెక్కండ్రఁ బట్టుకొని బంధించెను. కాని దౌలతరావు మొదలగువారు గోడలు దాటి పలాయితులైరి. అంతట వారందరుఁ దమప్రాణదాన మొసంగుమని రాణిని బ్రార్థింపఁ గాంతామతల్లి యగునాతల్లి కరుణారసైకప్రధా

నురాలు ముననుక్షమించి యభయహస్తంబిడెను. దాంతరావు మొదలగువారు మందమతులై పారిపోయిరి. కాని తెలిన్నమా యమ్మవారినిగూర్చి క్షమించియుండును. వారు మృత్యు దేవతకు బంధువులగుటచే పారిపోయిరి. నాకోరికదీర మాయమ్మయు జస్వంతరావుగారును సఖ్యతవహించినారు. అదియేనాకుశుభ సూచకముఅద్భుతరసముదయింపఁ జాలునావలుకులనాలకించి సీత తనమనోరథము సగము నెరవేరిన దనునానందముచే, దనమనోరథము పూర్ణముగ భిన్నమైన దను విచారముగాఁ డెం దముస మల్లడిగొన నిట్లనియె. "అమ్మా! మన మిరువుర మొకశరీరముగ నుండునంతటి నెయ్యము గలవారము. కాఁబట్టి శరీరము సగభాగము సంతోష మనుచిరువులో నుండ రెండవయర్ధము విచారమను పక్షవాతముచే స్పర్శ జ్ఞానము లేకయున్నది. ఇది నీకు సమ్మతమేనా? నిరపరాధి యగు శ్యామసుందరుని నానిమిత్తము బ్రతికింపుము" అని నల్ల గలువరేకులనుండి వెడలు మకరందబిందువులవలెఁ గాటుక కన్నులనుండి జారినవల్లని బాష్పములు ముక్తహారదళము గరఁగింత, సీతవిలపించిన ముక్త తనచేతనైనంత ప్రయత్నము జేయఁ దలంచి "ఓసీ యీదినమున మాయమ్మగారు సింబ పురమున కరిగెదరు. రాజపుత్రులు వచ్చి సింబపురమును బట్టు కొని దుర్గాధ్యక్షుఁ డగుశివనానాను బాఁదోలిరి. అతఁడీ దినమున మాయమ్మవద్దకు వచ్చినాఁడు. అందుచే రేపు మన మందరము సైన్యసమేతముగ సింబపురములోని కరుగవల యును. అచ్చటి కరుగుటకు ముందె దత్తును గూర్చి చెప్పెద నీవు విచారింపక ప్రయాణమునకు సిద్ధమై యుండుము" అని

మనవి ననుగ్రహముతోఁ జెవి యొగ్గి విని రాణి తన చెంగునా పెట్టెలో నుండి యొకజాబు దీసి "నామాటలు మిమ్ము నమ్మింపలే కుండినను నీచిన్న చీటియైనను మిమ్ము నమ్మింపక పోదు. నమ్ముకొనుఁడీ" యని యాచీటీ తుకాజీపైఁ బడవేయ నాతఁడు దాని నిట్లు చదువసాగెను. "శ్రీరఘునాధరావు రాధాకాంతరాయున కాశీర్వచనపురస్సరముగ వ్రాయునదే మనగా—నీవు నాకు మిత్రుఁడ వని నేను మిగుల నమ్మి యున్నాను. నన్ను మొదట మీదేశముపై రమ్మని జస్వంతరావు పిలిచినాఁడు. అతఁడు చలచిత్తుఁ డని వినుటచే నాతని మాటలునమ్మి నేను రానైతిని. నీవు నాలోఁ జేరి యహల్యాబాయితో యుద్ధము జేయుటకు సమ్మతించితివి గనుక నేను రేపు వచ్చి నిన్నుఁ గలియుచున్నాను. నీవు పుత్రభావముతోఁ బెంచుకొనుచున్న శ్యామసుందరుని మీరాణి యన్యాయముగాఁ జంపింపఁ దలంచుటచే నీకాగ్రహము కలుగుట దోషము కాదు. నీవు చేసినది రాజద్రోహము కాదు. కాని యిందూరు రాజ్యముయొక్క గుట్టుమట్టు లన్నియుఁ దెల్పుదునని నీవు వాగ్దానము జేసితివి కనుక యీ వాగ్దానము నిలుపుకొంటివేని మాపేష్వాయొద్దనీకుఁ దగినయుద్యోగమిప్పించెదను. రఘునాధరావు." ఆయుత్తరము జదువుకొన్న తుకాజీయు, విన్న శివనానా జస్వంతరావులును నాశ్చర్యముచేఁ గొయ్యలయి మాటలాడ నేరకుండిరి. రాణి వారి యాశ్చర్యమును జూచి "యాశ్చర్యమెందుకు? ఇట్టివారు మనరాష్ట్రములో ననేకులున్నారు. గంగాధర జస్వంతరావూ! నీవు పాతినకలహాంకురము మహావృక్షమై పెరిగి యున్నది గదా! నీవు లోఁగినను

నీచే ప్రేరితులగువారు లోఁబడలేదు. దీనికంతకు నీవే కారణుఁడవు గదా" యనుచుఁ దలవంచుకొని జస్వంతరావు తన యేలికతో "అమ్మా! యీ ద్రోహమునకు మూర్ఖప్రవర్తకుఁడను నేనే. నాపొరపాటు క్షమించి నన్నెప్పటియట్ల మన్నింతురని ప్రార్థించుచున్నాను. నేను జేసిన పాపమునకు నాపశ్చాత్తాపమే నన్ను దహించుచున్నది. మీరు వేరె శిక్షింపనక్కరలేదు. ఇంక మీయాజ్ఞ నతిక్రమింపనని ప్రమాణము చేయుచున్నాను" అని పరిపరివిధముల నామెను వేఁడుకొనెను. రాణియు వానిమాటలకు సంతసించి కారుణ్యము తొలికించు కటాక్షములు బఱపి వానితో నిట్లనియె. "ఓయీ మనరాష్ట్రమున భిల్లుల బాధ యెక్కువగానున్నది. అదిగాక రెండుమూడు దినముల క్రిందట శాయాజీహోల్కారను పేరుతో నొకక్రొత్త రాజు బయలుదేరి పట్టాభిషేకముఁ జేసికొన్నాఁడఁట. వాఁడెవ్వఁడో యానామధేయముఁ బూని నన్ను హితజ్ఞాతినని చెప్పుకొని ప్రజలను మోసము చేయుచున్నాఁడు. శాయాజీయను నొకజ్ఞాతి మాకుండెను. కాని యతఁడు మృతినొందెనని యెవ్వరో చెప్పినారు. ఆమాట యబద్ధమో యీమాటయబద్ధమో తెలియదు. భిల్లులు వానిఁ జేరినారు. దేశమునకు నిప్పటికే సేమములేదు. ఇంక ముందుగా బొత్తిగ సేమముండదు. అందుచేత నీశూరుఁడైన భిల్లులనందఱ శిక్షించి వారినాయకులగు గండాభిల్లు మొదలగువారిఁ బట్టుకొని నాకప్పగించి దేశమున దోఁపిడి మాన్పఁగలిగితివేని వానికి నాకుమార్తెయగు ముక్తాబాయి నిచ్చెదను. ఆకార్యమును జేయఁగలవాఁడు పళ్ళెరములోని

యీ తాంబూలమును గ్రహింపవచ్చు" నని బంగారుపళ్ళెరముతోఁ గర్పూరతాంబూలమిడెను. అందరు నొకరిమొగము నొకరు చూచుచు సందేహింపుచుండ జస్వంతరావు సంతోషభరితాంతరంగుఁడై లేచి యెలికేలో నిట్లనియె. "అమ్మా! నేనీ కార్యమును బూనెదను. భిల్లులను లోఁబరచుకొనుటకు శస్త్రా తరా వేలినవారి మొగముఁ జూడఁజను. నాకు చంద్రవదన యగు ముక్తాబాయిని విజయలక్ష్మితో పాటు పాణిగ్రహణము సేయుటయో, యోడిపోయి మృతినొంది వీరస్వర్గమను భా పాణిగ్రహణము సేయుటయో నా కీశ్వరుఁడు విధించినాఁడు. ఈ తాంబూలము నే నందుకొనుచున్నాఁడను" అనిపలికి తుకాజీ శివనానాలు విస్మయము నొందఁ దాంబూలము నందుకొని గంగాధరుడు నిలువ నహల్య యాతనిం గని "గంగాధరా! నీవట్టి కార్యమునకుం దగుదువు. చిరకాలమ్ము క్రిందట నంకురించిన యనురాగఫల మచిరకాలమున నిచ్చెఁగాక. నే సంబల్పురముపైఁ జనియెద. నేను మరల వచ్చునరకు గొండాభిల్లుగండడంచి నీవు భిల్లులగండఁడవై యుండవలెను. నీ సంగ బొమ్ము. తుకాజీ! నీవు మన సైన్యములో నొకవంతు నుంచి తక్కిన వాహినులఁగొని శివనానాసమేతుఁడవై రాజపుత్రసింహుఁడకుం జని రాణాకు బుద్ధి చెప్పుము. తక్కిన సైన్యముతో రెండుదినములలో నేను వత్తు" నని యానతిచ్చెను. వెంటనే రాణికి జోహారొనర్చి సెలవుగైకొని వారరిగిరి. అప్పుడు ముక్తాబాయి మాలిన్యమొదలిన ముక్తాఫలమువలె ముక్తవిచారయై ముక్తి నొందినదానివలె ముక్తభయయై యావద్దుర్నామముచేఁ బరిపూర్ణమునొందిన తనయుంగముల

సౌష్ఠవము వసంతకాలమునఁ గెంజిగురాకుల నొప్పు పల్లి
కాంతిచందములు విడంబింప, నెన్నడుము జవజవలాడ సుంద
గమనమునఁ జిఱునగవుతో నలంకరింపఁబడిన నెమ్మొగ
ముతో వికచారవిందయుగముఁబోలుకన్నుగవతోఁ దల్లికడకు
వచ్చెను. తల్లి చేసిన శపథమును బురుషతల్లజుఁడగు గంగా
ధరుఁడు చేసిన శపథమును ముక్తను సంతోష సముద్రమున
నోలలాడించు రెండు తెప్పలయ్యెను. వచ్చినకూఁతుం జూచి
తల్లి "తల్లీ! నీ నగుమొగము క్రొత్తవిలాసము నొందియున్నది.
జరిగిన సంగతులు వింటివా యేమి?" యని తనకూఁతు
హృదయ మానసకే జన్మఁతొనివంకే మరలినదని యెఱుఁగు
టచే నవ్వుచుఁ బలికెను. ముక్త లజ్జచే శిర మించుక వంచి
నేలఁ జూచుచు "తల్లీ! నామనవి నాలకించి మనసీత హృద
యము చల్లబడునట్లు దురదృష్టవంతుఁ డగు శ్యామసుందరుని
విడువుము. ఇది చేయవేని సీత దుఃఖించును. నేను దుఃఖింపక
మానను. నేను దుఃఖించిన దుఃఖము రాక మానదు. కాబట్టి
నన్ను దయఁజూడు తల్లీ యని బ్రతిమాలెను. ఆదీనాలాప
ములు విని తన కూఁతునకు సీతపైఁ గల ప్రేమాతిశయమును
జేయఁదలచిన కార్యముపైఁగల పూనికయు నెఱిఁగినదగుటచే
రాణి కూతుం గనుంగొని "నీవింతమూర్ఖపుపట్టు బట్టినావు.
నీ నిమిత్తమున నే నతనిప్రాణముల నిచ్చితిని. కాని యాతని
నా రాజ్యమున నుండనీయను. అతఁడు నాదేశము విడిచి
పోవునట్లుత్తరవు జేసెదను. నీవును సీతయు నింక నింబపుర
ప్రయాణమునకు సిద్ధముగ నుండుఁడు" అని పలికి కూఁతు
నొడఁబఱచి పంపెను. ఆ మధ్యాహ్నమే శ్యామసుందరుఁడు

చెఱలో నుండి విడిపింపఁబడి రాష్ట్రము నుండి తరుమఁబడెను. తుకాజీయు శివనానాయు నరిగిన రెండవదినమునను రాణి విజయభేరి కాహళధ్వానములు శత్రువుల హృదయములు వ్రక్కలుచేయ మహిషాసుర నిర్మూలనకేళి కిరుగునఁగఁ మహాశక్తివలెఁ చతురంగబలముతో నింబపురముపైఁ బడియెను.

## పదునేడవ ప్రకరణము.

తుకాజీహోల్కారును శివనానాయును సైన్యమును దీసికొని నింబపురమునకుం జని రాజపుత్రులచే నాక్రమింపబడిన నింబపురపుకోటను ముట్టడింపసాగిరి. రాజపుత్రసేనకు నుదయపుర రాణా నాయకుఁడై కోటలనుండి మహారాష్ట్రసేనల నెడ దెరపి లేకుండునట్లు తుపాకులబారులచే నొప్పించుచుండెను. రాణాకు రెండుకన్నులవలె గనుటో పాటు వేదులగు భేతాళసింగును భైరవసింగు లిరువురు రాజపుత్రులు సమస్తసహాయములు జేయుచు నిందూరుపురవాతెర్లు సహాయ్యప్రయాణ వాతెర్లును విన్నవించుచుండిరి. రాజపుత్రులు నింబపురము నాక్రమించుటకు ముఖ్యకారకుఁడు గోమాజీరావే కనుక నతఁడెప్పటివలెన్ మానక యప్పుడు గూఢసంచారు లగుచారుల ముఖమున భేతాళసింగునకు నెరుఁగజేయుచుండ, నతఁడు రాణాకు నెరుగజేయుచుండెను, గోమాజీరావు హోల్కారు

రాజ్యముయొక్క గుట్టును బైటఁబెట్టిన పక్షమున వేయివరహాల తన కిచ్చెదనని భేతాళసింగు వాగ్దానము చేసినందున సింబపురముపై రజపుత్రులను రప్పించియు నచట దుర్గాధిపతి యగు శివనాను పరాక్రమహీనుఁడనియు జెప్పి గోమాజీ రాజపుత్రులను రావించెను. రజపుత్రుల మనోరథము తీరినను గోమాజీయొక్క మనోరథము తీరదయ్యెను. భేతాళసింగు వాగ్దత్తము చేసిన ద్రవ్య మతనికిఁ బంపుటగాని యతఁడు వ్రాసిన జాబులకుఁ బ్రత్యుత్తర మొసఁగుటగాని సలుపఁడయ్యెను. అందుచే గోమాజీ తనకిష్టుఁడైన వామనభట్టుచేతఁ గొన్ని యుత్తరములు వ్రాసియిచ్చి యవి భేతాళసింగున కిమ్మని చెప్పి వానిని సింబగపురమునకుఁ బంపెను. అంతఁ బటౌండ జస్వంతరావు రాణీపక్షమునకుఁ దిరిగిపోవుటయు గోమాజీరావు స్వలాభపరాయణుఁడై ప్రత్యక్షశత్రుఁగఁ గానఁబడుటయుఁ జూచి దౌలతరావు భిల్లులను శాయాజీహోల్కారును నమ్మియుండుట కేవలము మంచిది కాదని రజపుత్రులతోఁ గలిసి కొంతపని జేయుట యుచితమని సింబపురమునకుఁ దాను గూడ మహారాష్ట్రసైన్యముకంటె ముందుగఁ జని రాణాను దర్శించి యాతనిచే గౌరవింపఁబడి యచ్చట నుండెను. తుకాజీ బయలువెడలిన రెండుదినములకు శ్రీరాణి యహల్యాబాయి కొంతసేనతో సింబపురముపైఁ జనుచు మార్గమున నచ్చటచ్చట నిలుచుచు నాయా గ్రామముల ప్రజలం బిలిపించి భయపడవలదనియు భిల్లును జస్వంతరావు సంహరించి దేశమున సుఖకాలము సేయుననియు దురాత్ములు చెప్పు తేనెతేటల వంటి మాటలకు నోడి చెడిపోవల దనియు నుపదేశించుచు బయనము సేయు

చుండెను. పెరిగొక పల్లకిలో గూరుచుండి ముక్తాబా
యియు సీతయు రాణివెంట వచ్చునెడ గ్రామముల నా
గరికులఁ గనుఁగొనునపుడు వారెందు నాశ్చర్యమును నవ
ముల బ్రయాణముచేసినపుడు నెమలి, లేడి మొదలగు ముద్దు
లుమూటగట్టు జంతువులఁజూచి పొందినయానందమును గుట్ట
లనుమహోన్నతపర్వతములను గొండకనుమలను సెలయేళ్ళను
వీక్షించి యనుభవించిన సౌఖ్యమును వర్ణింప నలవి గాద
య్యెను. అదివర కెన్నడు నంతఃపురము విడిచినవారుగాకుండు
టం బట్టియు నిట్టివినోదములకు క్రొత్తవారగుట బట్టియు
యానప్రాదుర్భావముచే ముందువెనుక లెరుగనివారగుట
బట్టియుఁ బయనమే సుఖతరమనియెంచిసర్వ[illegible] దలుపులం
దెరచి చూచుట కారంభించిరి. సైన్యమున విస్తారభాగము
తుకాజీతో బయలుదేరి మదగజాధిరోహణముచేసి తాను సేనా
గ్రభాగమున నుండి శత్రువులొకవేళ పయిఁబడిన స్త్రీల
కపాయము గలుగకుండునట్లు ముక్తను సీతను వెనుక నాఁబని
చెను. ఇందూరువదిలిన మూఁడవనాఁడు సాయంకాలమిరాచిన్న
సేనయొకయడవిలో ముప్వరుమనుష్యు లొకమారు వరుసగా
నడచిపోవుటకుఁ దగిన వెడల్పు లేని యొకయిరుకుత్రోవలఁ
బట్టి పోవుచుండెను. రాణి యధిరోహించిన యేనుఁగు సుఖ
ముగానడచుటకామార్గము చాలకుండుట నాజంతువును
మిక్కిలికష్టముతో బయనముసేయఁ దొడఁగెను. వెనుకవారు
ముందుకుగాని ముందువారు వెనుకకుఁగాని వచ్చుటకు వీలు
లేదు. అందుచేత మనుష్యు లందఱుఁ జీమలబారువలె నొకరి
వెనుకనొకరు నడిచియక్కడికి సమీపగ్రామమునకు సాధ్యమ

యనంత వేగముతోఁ బోఁజూచిరి. గాటముగఁ జీకటి నభమంతయు వ్యాపించి యప్పుడప్పుడే పట్టిన నల్లమబ్బులసాయమునొంది సూర్యాస్తమునకు దారి తెన్ను గానీయకుండెను. ఉఱుములు మెఱుపులు నట్టహాసముచేసినందున జన్వాను లిద్దఱుఁ బ్రయాణము గొంచెము కష్టమని యోచించిరి. అంతలో నొకఝంఝాస్వానముతో రాత్రియందు ఘోర ఝంఝామారుతము వీచఁ దొడంగెను. ఆ సమయమున సేమూరుఁ బడియో కొండయేట్రి ప్రవాహమువలె మహారావముతో నలుదెసల నున్న కొండలుచరచరదిగి యుగ్రధనుష్పాణులును విలక్షణాకృతులు నగు భిల్లుల యూఁకలు వచ్చి యొకపెట్టున సేనయొక్క వెనుక చక్కిందాఁకొనెను. తాఁకుటయు బాలికలిరువురు నాక్రందనధ్వనిజేసి అమ్మా దొంగలు దొంగ లనియఱచిరి కాని వారిసొదన మరణ్యరోదనమై యామహావాయువుచే నిగ్రమింగబడఁ యహల్యచెవులకెక్కదయ్యెను. భిల్లులయొరవు మోఁగ నకిలిలింపులు గొంచెము రాణిచెవికిఁ బొడకట్టును. గానియామె తన సేనలవారు దాఁపరని తెలియలేకపోయెను. అంతట సామగ్రి మోయుకూలివాండ్రు నిర్విణ్ణహృదయులై భుజములపై బరువుల దింపి శత్రులకుఁ జేతులు జోడించి దండములు పెట్టి తమప్రాణములు గాపాడుకొనిరి. ఎదిరించువారెవ్వరు లేనందున గుండాభిల్లులు సైన్యమున బియ్యము మొదలగు పదార్థములఁ దమసేవకుల చేతి కిచ్చి బాలిక లున్న రెండుపల్లకుల దగ్గరకు వచ్చి తలుపులు దెరచెను. అతని భయంకరాకారము జూచి ముక్త బొమ్మయుక్తయయ్యెను. సీత భీతయయ్యెను. ఆసందడిలో భిల్లులతోఁ గొల్లసలుకు వచ్చినా హరిహరపాం

ద్యాజి యామిటారులపై జేతులు వైచి యుందు ముఖ్యము ముక్త యొంట నున్న యమూల్య రత్నములను బాళీ వాబటసగలను దనిని దీర దోచుకొనుచుండ నాలత కూనలిం పురుమూర్ఛిల్లి యొన్నడు వచ్చినట్లుండెను. ఇట్లు దోపిడిచేగోరి బలుక సఫలమైనందున వారి వారందు సంతోషపారవశ్యమునే బలుకజాలక మాటిమాటికా నగలు మూటిం జూచి మురియుచుండ “నీమె కాదామె. ఆమె కాదీమె” యని భిల్లులలో నొక విధముగ వాగ్వాద మారంభించెను. ఒకపట్ల నొకరొత్తి మాటలాడం జాలక వారివారుందు వ్రేలితో నొకపల్లకిని జూపినందున వారు వాదము మాని యిదియే ముక్తాబాయి యని యాపల్లకి నా భిల్లులు భుజముపై నిడుకొని యనాయాసముగ గొండలు సెలయేళ్ళు దాటి పరువెత్తి యదృశ్యులయిరి. ఇంతనీ వార్త కర్ణాకర్ణిగ విని రాణి యాలకించి పుత్రికావియోగదుఃఖముచే వెడలు బాష్పములం దుడుచుకొనుచుం గత్తియు సైనికులతో రంగస్థలములకు నొక్క నిమిషమున వచ్చి వ్రాలెను. కాని దొంగలు స్థలము విడిచిపోవుటయే కాక దృష్టిపథముం దప్పిరి అంతట నామె హా! ముక్త! నన్ను విడచి యడవుల పాలైతివేయని విచారించుచు రెండవపల్లకినద్ద కరిగి మూర్ఛిల్లియున్న కన్నెం జూచి సీతా సీత యిటు రా నీ చెలి భిల్లులపాలయినది యని లేపెను. ఆ పలుకు లామెను మూర్ఛనుండి మేలుకొలిపినందున బాలిక కన్నుదమ్ములు విచ్చిచూచి “అమ్మా! దొంగలు పోయినారా, నా స్నేహితురాలిని గొనిపోయినారా” అని యహల్యాంకంకమునకుం జేతులు పెనవేసి

కౌఁగలించుకొనెను. అహల్య యాశ్చర్యనిమగ్నయై "యేమిది! అమ్మా! నీవు ముక్తాబాయివా! పాపము సీతనే దొంగ లెత్తుకొని పోయినారా యని కూఁతుఁగన్న మోదము, సీతఁ జన్న ఖేదము చిత్తమున ముల్లుఁడిగొన ముక్తాబాయిని లేవనెత్తి ముద్దుపెట్టుకొని సీతకై మిగుల విచారించి తన కంటెఁ జెలినిమిత్తము మిక్కిలి వ్యథనొందుచు కూఁతునూరార్చుచు నామెను సేదదేర్చి వెంటఁ బెట్టుకొని తురగముపై నెక్కించుకొని సైన్యముతోఁ గేలల ముడిపి తిరిగి ప్రయాణము సాగించెను. త్రోవలో ముక్త సీతను దలంచుకొని "అమ్మా! యింక నేను సీతను జూడఁగాఁజాలను. దాసిమాట లేనమ్మా. అది పలుకుట యమృతవర్షము గురియుచుండెనమ్మా. ఆహాహా! మఱుఁదలఁచినను దాసిచక్కఁదల మాసిపోరావు తల్లీ. అది దాసి యటమ్మా వరహాలకుప్పగాని హా! సీత! భిల్లుల చేతఁ జిక్కినతరువాత నీవు నాకు దక్కుట యెక్కడిది? వారే దేవతకో బలిపెట్టుదురుగదా" యని విలపించు కన్నీరు దుడిచి తల్లి యామె నూరడించి సీతను వెదకించి తెప్పింతునని పలికె భిల్లులమీఁద కరుగునప్పుడు సీతజాడలు దీయుమని జస్వంతరావునకు రాణి జాబుల నంపెను. అట్లు చని యారాత్రి సమీపగ్రామము జేరి యందుండి మరునాఁడుదయమున బయలుదేరి ప్రయాణము సాగించి కొన్ని దినములలో నింబపురసమీపమును జేరఁ జనిరి. రాణిరాక మున్నె విని తుకాజీ శివనానా మొదలగు సేనాధిపతులు భయసంభ్రమములతో నామె నెదురుగొని యామె యెనుంగుల కిరుకెలంకులందారు నడచి ప్రత్యేక

మామెకై వేయఁబడిన గుడారములో నామెను బ్రవేశపెట్టి తద్దేహసంరక్షణార్థమై యేనూఱుగురు జోదులను గుడారము చుట్టుఁ గావలియుంచి రాణితో శివనాసా యిట్లనియెను. "అమ్మా! మేమువచ్చి నాలుగుదినము లయినది. తుకాజీగారు సేనను గడుజాగ్రతగఁ గోట ముట్టడించుచున్నాము. మీరు కూడ శ్రమపడనక్కఱ లేకయె కోటలోఁబడును. మీ దేహ సంరక్షణార్థము మేముంచిన యీసేవకులలో నేఁబదుగురు తురకలని వీరిని దిరస్కార భావముతోఁ జూడవలదు. మన విషయమున హిందువుల కంటెను కృతజ్ఞులుగ నున్నారు. అందీజమాన్ ఖాను సాహసవిక్రమార్కుఁడు. రాజపుత్రులు వచ్చినప్పటి కీశూరశిఖామణి యూరకలేఁడు. కాని యుంచినచో నింబపురము మీరు రావలసినయవసరముండక పోవును. ఈతనిచేత మీరన్ని కార్యములు చేయించుకొనవచ్చును." అని చెప్పి యొక్క సుందరుఁడగు తురుష్కవీరునిం జూపి యప్పగించెను. రాణి యాపలువురు కలరి జమానుఖానుఁ మొదలగు మహమ్మదీయులయందు నమ్మక ముంచి వారిచే సంరక్షింపబడుచు గాఢముగా ముట్టడి జరపుమని యానతిచ్చి యుద్ధముల నారితేరని స్త్రీయయ్యు భయమనక పగలనక రాత్రి యనక గుఱ్ఱముపై నెక్కియు ఏనుఁగుపై నెక్కియు స్వయముగా సేనలఁ బురికొల్పుచుఁ బ్రాలుమాలిన పోభటుల రక్షింపుచుఁ బరభటులను దుంపఁ జేయుచు నిరువురచే శ్లాఘింపఁబడఁజొచ్చెను. నింబపురాంతఃపుర కాంతలగర్భంబులు వియఁ జేయు ఫిరంగిగుళ్ళు గభిల్లుగభిల్లుమని కోటగోడలు దూట్లు

పడఁ జేయుచుండెను. రాజపుత్ర మహారాష్ట్ర సైన్యములు దూరమునుండి యొకరిపై నొక రగ్నివర్షములు గురియుచుండిరి. ఇట్లు ముట్టడి జరుగుచుండ రాణివచ్చిన మునునాఁటి రాత్రి గుడారములో రాణీయు, ముక్తయుఁ గూర్చుండి సీతను గూర్చి ముచ్చటించుచుండఁ గావలిగాచు జమానుఖానుయొక్క కఠినమగు కంఠధ్వని వారికి వినఁబడ రాణి యొక సేవకుని బిలిచి యది యేమని యడిగెను. ఆ సేవకుఁడు నమస్కారముఁజేసి "అమ్మా! నలువదియేండ్ల వయస్సుగల స్త్రీ తమ దర్శనమునకు రాఁగోరుచున్నది. యుద్ధసమయములయినందున బయలవారిని జమానుఖాను నామెను నిరోధించినాఁడు. అదియే యాగడమని విన్నవించెను. రాణి యా మాటలు విని నవ్వి స్త్రీలను రానిచ్చుటచే నేమి నష్టముండును! ఆమెను రానిమ్ము. ఆమె యేమి చెప్పునో యని జమానుఖాను వత్ర్మాస మంచు నతఁ డామెను లోపలికి వదలెను. పచ్చిసదబ్బపండువంటి దేహచ్ఛాయ గలిగి పొట్టిగ లావుగనున్న యాయంగన యెఱ్ఱనిచీర గట్టుకొని మొగమున నెఱ్ఱని కుంకుమబొట్టుతోడను గుబురుగల వెండ్రుకలతోడను వాడిచని మొగముతోడను వచ్చి రాణియెదుట నిల్చి "అమ్మా! నా మొఱ నాలకింపుఁడు నేను వింబపురవాసురాలను. నాకుమారుని శివనానాని నాకుమారుని చెరలో నుంచినాఁడు. అదిగాక యీముట్టడిలో నాపని పట్టెదనని యిదివరకుఁ బ్రతిజ్ఞ చేసినాఁడు. అందుచే నే నసహాయురాలనగుట మీయొద్దనుండఁ గోరి వచ్చితిని. నాకుమారుని చెఱనుండి విడిపింపుఁడు." అని

రోదనము చేయ సాగెను. శివనానా యామె కుమారుని నిర్హేతుకముగన్ జెయిలో పెట్టఁబడెనని నిశ్చయముగ నెఱిఁగి యాతని నిజమయినను నావిషయమై యడిగినచో నేమికార్య భంగము వాటిల్లునో యని శివనానా నటుగుటను నద్యుక్తురాలు గాక భయపడిన దాయఁగనుమాత్రము తనతో నుండుమని "అమ్మా! నీకుమారునకుఁగాని నీకుఁగాని భయము లేదు. ముట్టడి యాఁగువరకు నీవు నాగుడారమున నుండుము. నేనుండ భయమేల" యని యామె భయముడిపి రాణి యా రాత్రి నిద్రించెను

## ప దు నె ని మి ద వ ప్ర క ర ణ ము

మనుష్యరక్షితములుగాక యెండకు నెండి వానకుఁ దడిసిన యడవిచెట్లనున్న పరిమళముల గ్రహించి మందముల యానిలుండుతన గంధవహానము సార్థకముగా వరుదెంచి యున్నతపర్వతముపై గుడారమునఁ గొలువుదీర్చిన శాయాజీ హోల్కారుయొక్క శ్రమలన్నియుఁ దొలఁగఁ జేసెను. అతఁ డొకకుర్చీమీఁద సుఖాసీనుఁడై యదివరకుఁ బీల్చినగంజాయి మత్తు తగ్గినందున మరలఁ గొంచెము గంజాయి తన దగ్గర నిలువఁబడిన బాలకునడిగి నాలుగుగుక్కలు పీల్చి వహవ్వావ హావ్వా నీవు మంచివాఁడవురా కుఱ్ఱా నీవే ఱెవ్వరురా మరచి నారు. ఫాజీగాఁడా" యని యాబాలు నడిగెను. హోల్కారు

రాజవంశమున నుదయించిన వానికిట్టి తుచ్ఛమైన యభ్యాసము లెట్లలవడె నని మనస్సున నొచ్చుకొనుచు "నా బాలుఁడు నా పేరు బాజీరావు జీ కాదండి" యని యుత్తర మిచ్చెను. శాయజీ ప్రత్యుత్తర మిచ్చుటకుఁ బ్రయత్నించుచుండ నింతలో గండాభిల్లుపాండ్యాజీలు గుడారపు వాకిటనిల్చి హోల్కారువారిదర్శనముఁ జేయఁ గోరు సతిఁను వారినిరమ్మనియెను. వారులోనికివచ్చునప్పటికి శాయాజీ బాజీరావు నావలికంపి వారచ్చటికి వచ్చినకార్య మేమియని యడుగ హారిహారుఁ డిట్లనియె. "మహారాజా! అహల్యాబాయికి ముక్తాబాయిపై ప్రేమమెక్కుటమని విని గూతురు మనస్వాధీనములో నుంచుకొన్న పక్షమునఁ దల్లి మనము చెప్పినట్లులో బ్బకొను కుమార్తెకై ప్రాణరక్షణార్థము మనకు రాజ్యమువదలి వేయు నని ముక్తాబాయిని దెచ్చినాము. ఈపర్యాయము తమరు తప్పక రాజ్యము గైకొనవచ్చును. కావలసినచో నీమెను వివాహమాడవచ్చును. ఈపలుకులు శాయజీచెవులఁ బడినతోడనే యేడీ నాప్రియురా లేది యని సిగ్గునఁ బీఠము నుండి లేచి గుడారము వెలుపలికి వచ్చెను. గండాభిల్లింతలో బల్లకిం దెమ్మని బోయల కానతిచ్చుటయు వారం దున్న యుందకత్తెను మోసికొని వచ్చి హోల్కారునెదుట నుంచితలుపులు దెరచిరి. తమకు మున్ను సుల్తానుబిరుదు నొసంగినహోల్కరొక్క విశ్వాస మధిక మగుటచే గండాభిల్లు వల్లవాధరిం గని ప్రభువువారు నినిమిత్త మెనరుచూడ మొద్దులాగునఁ గదిలిరా వేమి యీపాటికి రాయని మృదుతరమృణాలముల నిరసించు నామె బాహువల్లి బట్టుకొనిలాగ మదకరివంటిభిల్లుని మోటు

చేయి పోఁకుటచే నరము బెణికి కడుబాధగలుగ, "అమ్మా" యని జాలిపుట్టనరచి ప్రతిమలాగు సీత వాఁడు లాగినవైపున కేఁజని నిశ్చేష్టురాలయి పల్లకికిఁ జేఁబడెను. శాయాజీశరీరము పులకితమెత్తఁ గన్నెత్తి యాపుత్తడిబొమ్మం జూచి మేలి ముసుంగు దియుమని యా సతిని గండాభిల్లు కన్నియుం డాసి వలదు వల దని యామె చేతులతో
జేతులు వదలించి మేలిముసుంగుదీసెను. తీయుటయు మేఘము నుండి వెడల మెరుపులువలెఁ దెరచాటు నుండి వచ్చు భామ వేషము వలె భూమిని సంచరింపవచ్చిన యచ్చరవలె నపుడు దయించి పూర్ణచంద్రబింబము లె ముఖకళలు పర్వముజేయుచు నాలంతాగి నిలువ ముసలివాఁడగు హరిహరుఁడు, శృంగారస మెరుఁగని మోటువాఁడగు భిల్లుండును మోహాతిశయులై యు విళ్ళులూర నాగరికుడును బహుచువాఁడు నగు శాయాజీస్థితి వర్ణింప నేరి తరము ఇట్లు మోహసముద్రమున గొంతసేపు మునకలు వేసి వేసి వారుమువ్వు రొకరినొకరు జూచుచు భయ లజ్జలచే వారిం జూడఁ జాలక మొగమావలివైపున కాశాలిక ప్రతివ్రాకొన్నను వంగి యాముఖము గనలారఁ గనుచుండ శాయజీ వారలతో "హరహరా! ఈమె ముక్త కాదు. ముక్త నే నెరుఁగుదురు. ఆమె యింతసౌందర్యవతి కాదు. ఈమె పే రెరుఁగను. కాని యాకారము నాకుఁ గ్రొత్తది కాదు. సుమీ యనసుందరీ! నీవెవరివే" యనియడిగెను. మహారాజుగారి ప్రశ్న కామె యుత్తరము నొసంగుట కిష్టము లేని దయ్యెం దన్న వారు ముక్తాబాయిగా భావించుచుండిరి. గనుక తన పేరు ముక్తా

చిరి. మొదట సీత యక్కడికి వచ్చుటతోడనే శాయాజీ బాజీరావును గుడారమునుండి యీవలకుఁ దోలినంతను నాతఁడు గుడారముచాటున కరిగి యచ్చటఁ గూరుచుండి వచ్చిన యీయువతి యెవ్వరో యని కుతూహలము ప్రేరేపింప గుడారపుగుడ్డకున్న చిన్నరంధ్రమునఁ దనకన్నులుంచి సీతను జూచెను. చూచినతోడనే యాతని మనస్సున కేవి పుట్టెనో కాని బొటబొటఁ గన్నీరు కాలువలై చెక్కులమీఁదుగ నేత్రద్వయమునుండి ప్రవహింప బాజీరావు హా దైవమా! మాకిరువురకుఁ గూడఁ దగని యాపద దెచ్చిపెట్టినావుగదా, యని విలపించి తాను దుఃఖించిన జాడ యేరికినైనఁ దెలిసిన వారు తన్ను గారణ మడిగి తెలిసికొని బాధింతురని కన్నీరు సత్వరమే తుడుచుకొని యెటులైన సీత నొకపర్యాయము గాంచికొని మాటలాడవలయు నని ప్రయత్నించెను. కాని యాదినమున సమయము దొరకదయ్యె. ఆతఁ డొకటి రెండు సారులు సీతయున్న గుడారము ముందరి కరిగి నిలువ భిల్లు లతని గదిమి కొట్టిరి. అందట బాజీరావుకాలుగాలిన పిల్లివలె నిటునటుఁ దిరుగుచుఁ జెప్పినమాటలు చక్కగ వినఁ బడమి శాయాజీచేఁ జీవాట్లు దినుచు మితిమీరిన సంతాప మొందసాగెను. ఆగుడారమునఁ బ్రవేశించుటాది సీత నెమ్మనమున నుమ్మలికము హెచ్చ "హా భవానీమాతా! నాఁడు సన్యాసిరూపమున నీవే నాపరాభవము దప్పించితివి. నేఁడు పంచాగ్నిమధ్యమందు నన్నుంచినట్లు క్రూరజనమధ్యమున నుంచితివి. నన్నుభంగపుచ్చుటకు యత్నించువారు కాని నివారించువారు లేరు. ఏమివని జేసినను నీదాననే" యని వేయివిధ

ముల మ్రొక్కుచు హరిహరుఁడు తన కంపించిన భక్ష్యములు గాని మహారాజుగారు ప్రత్యేకముగఁ దననిమిత్తమై వండించి పంపించిన మాంసాదకములు గాని భక్షింపక యున్నను నుట్టికి నీరుగూడఁ ద్రావక శుష్కోపవాసము చేసి భిల్లులు విడుచునంత తప్పించుకొని పోవువఱకు నుపవాసములు చేయుచున్నట్లు ప్రతిన గావించెను.

శాయాజీ హోల్కారు సూర్యాస్తమయము మయిన తరువాత మనసఖాణహర్షుఁడై పలుమారు సీత యున్న గుడారము యొద్ద కరిగి యటనుండు భిల్లులను జంకించుచు నుండిల పట్టునై పసగుచు బ్రతిమాలియో బలాత్కరించియో యామెను దనస్వాధీనము జేసికొనఁ గోరుచుండెను. హరిహర పాండ్యాజీ వృద్ధుఁడయినను చాసితోరికి పడుపుతినమునందుండు టచే నెట్టియన సమయముననో భయముననో బాలికను దాను స్వీకరింపఁగోరి నిద్దుర లేక సమయమున కెదురు చూడసాగెను. బలవంతముగ గుడారము జేరిన పక్షమున హరిహరుఁ డేమను కొనునోయని శాయజీయు శాయాజీ యేమిసేయునో యని హరిహరుఁడు నొకరకొకరు జంకి చతురంగమున నొకగుఱ్ఱ మొకగుఱ్ఱముచేఁ గట్టఁబడిన పడువున నామెదగ్గర కరుగరైరి. దైవయోగమున నావృద్ధుఁడు బాలుఁడు పరస్పరమత్సర బద్ధులై భిల్లుల ప్రమేయమున్నను గుడారమును గాచుచుండిరి. హరిహరుఁడు నిద్ర లేక శవజాగరణము చేయుచున్నాఁడో యని మహారాజు నిందింప నీకుఱ్ఱవాఁ డేల దయ్యమువలెఁ దిరుగుచున్నాఁడో యని హరిహరుఁడు వానిని నిందింపఁ దొడఁగెను. ఒకమారు కామాగ్నికిఁ దోడు క్రోధాగ్ని గూడ జనింప

శాయాజీ ఖడ్గము ధరించి హరిహరుని జంప నుంకించి చప్పుడు తెలిసి దెచ్చుకొని యది తన భవిష్యదభివృద్ధికి నాశనకారణ మని యాపటి మానసి తుదకుఁ బ్రాణములు పిసికి కామపార వశ్యమునుండి తొలఁగింపఁబడి నిద్రాపారవశ్యము నొందెను. అప్పుడు హరిహరుఁ డాజాడ దెలిసి గుడారము జేరఁబోయి యమదూతలవలె భిల్లులు మేలుకొనుటచే వెనుకకుఁ జని రవంతసేపు కునికెను. ఆవగింజంతసమయ మెట్లయినఁ జేకురు నేని దానింబట్టి సీతాదర్శన మొనర్చి మాటలాడఁ దలఁచి రేయి నిదుర లేక శ్రమ పడుచున్న బాజీరావు పీరిపురు నిద్రాసక్తులై కాఁజూచి భిల్లు లంతకుముందే దేహములను మరచి గాఢసుషుప్తులగుట నెరిఁగి యది చీఁకటిరాత్రి యగుట నెంచి మెల్లమెల్లగ సీతయున్న గుడారపు ప్రక్కకు వచ్చి నిశ్శబ్దముగఁ గూరుచుండెను కూరుచుండి భూమినిదాఁకు గుడారపుముతకగుడ్డను దన చేతులతో మీఁదికి నెత్తి యల్లన దానిక్రిందదూరి లోపలఁ బ్రవేశించి చప్పుడు గాకుండ దేఁకి సీతకడ కరిగెను. నిద్ర పట్టకున్నను బరధ్యానముగ నేమో యాలోచనసల్పుచుండిన సీతయొక్క మృదుదేహముపై బాజీ రావు చేతులువైచి తట్టె నామెయులికిపడి శాయాజీయేమో యని వడఁకి ఛీఛీ దురాత్మా పోపో యని గద్గదస్వరముతో నరచెను. ఆ పలుకులు కలుగక బాజీరావు "నే నక్కయ్యా నేను బాజీరావును నీవు భయపడకు" మని మెల్లనఁ జెవిలోఁ జెప్పెను. అమృతసేచనము జేసినచందమున నా మాటలు తన చెవికిఁ దృప్తియొసంగఁ జేతులతో వానిదేహము దడవి పూర్వము దా నెఱింగినయానవాళ్ళనుబట్టినతనిం బాజీరావని

గ్రహించి "నాయనా నీవును నామూయభిల్లుల చేతనే చిక్కితివా" యని రవంత సేపు వగచి యాతని దగ్గఱ దీసికొని నాతఁడు నామెయొడిలోఁ బండుకొని మహారాత్రము దాఁక అక్కయ్యా! నన్ను భిల్లులు రెండుసారులు వారి దేవతకు బలి వెట్టనెంచిరి. ఈ పర్యాయము మనమిద్దఱముగూడ నటులే యగుదుమేమో, యని యేడువసాగెను. సీత వానిపలాపమును వారించి యిది దుఃఖమునకుఁ దగినయదను కాదు. ఉపాయములచే మన మిచ్చటనుండి దాఁటవలయును. నీవు నేను జెప్పినట్లు జేయుము. అని వానికిఁ గొన్ని రహస్యములు చెప్పి యిక్కడ నీవున్నచో మనకు నిరువురకు నాపద వాటిల్లును. సత్వరమే సాగిపొమ్ము. లే యని వాని నంపెను. అతఁడును బూర్వప్రకారమున గుడారము నొత్తిగించుకొని యావలఁబడి తనయేలిక ప్రాకారమున కరిగి తనస్థానమునఁ దానెప్పటియట్ల శయనించెను. ఉదయమున పాశిహాసుఁడు హోల్కారుకన్న మున్నే లేచి కాల్యకృత్యములం దీర్చుకొని బాజీరాయునిఁ జేరఁ బిలిచి ఇత్తా సీతవద్దను నీవు సేవకుఁడవై ననుచేఁ బలుమాఱు బోవుటకు నీకు త్రోవ గల్గునట్లనేఁ జేసెదను. నీవామెతో నాపైఁ బ్రేమగల్గునట్లు నన్ను వివాహమాడునట్లు లోతి చెప్పి నాకీ యుపకారము జేతువేని చెఱనుండి నిన్ను వదలించెదను. కావలయునేని నీకు ధనముగూడ నర్పించెదను. అట్లు చేయుగలవా యని వినయమునఁ బలికెను. ముసలివానికింత గోర్కె యున్నందునకు నగవును దన్నట్టి దుష్కార్యమునకాతఁడు నియోగించినందు కలుకయు నతని మనస్సున నుదయింప బాజీరావు వానిని వారించుకొని కాలానుసారముగ

వశీకరింపఁదలఁచి, యయ్యా నాకిది యిష్టమే. శాయాజీకూడ నామాన గోరుచున్నాఁడు. వానిని గడతేర్చిన పక్షమున మీకీమొకక్కు ననియుత్తరమీయ హరిహరుఁడది యెంతపని మీరాత్రి చేతునని సంతోషముతో వాని నంపెను.

## పందొమ్మిదవ ప్రకరణము

అట్లు భిల్లుల శిక్షించుటకుఁ బ్రతిన బూని జస్వంతరావు రాణిపడిగి కొంతసైన్యమును వెంటఁబెట్టుకొని భిల్లులగూడెములపైఁ బడి వారిలోఁ బలువురఁ బట్టుకొని జెరలో నుంచుచు ముఖ్యులగు నాయకులను వృక్షములకుఁ గట్టి యురిదీయించుచు నొకమాఱు వారు తిరుగఁబడునపుడు వారితో సేనాధ్యక్షు కయ్యములు సల్పుచు నొకమాఱు అపజయము నొందుచు జయాపజయములననుభవించిన సంతోష విచారములఁ దను కనుపట్టినిల్లగునటుల ముక్తాబాయిపై హృదయము నిల్పి నిజయశోకాంక్షపై దృష్టినిల్పి విహరింపఁజొచ్చెను. ఒకమాఱు గొందఱఁబట్టి కరిమార్చుచుండ రెండవమాఱు మఱికొందఱు పల్లెలపైఁబడి దోఁచుకొని బీదకాఁపుల గృహములు బరశురామప్రీతి జేయసాగిరి. అహోరాత్రములు నిద్రాహారములు లేక జస్వంతరావు ప్రాణములను లక్ష్యపెట్టక యెందఱిని శిక్షింపుచున్నను భిల్లు లిసుకపాతరమువలె తగ్గరైరి. కాని యాతనియెడ తెగినపూనికవల్లను వహించిన క్రౌర్యమువల్లను

భిల్లులకుఁ దమువినాశకాలము దాపయినదనుమాట తెలియు
టయ్యేగాక జస్వంతరావు నామము విన్నప్పుడు వారికొక విధ
మయిన యడలు కూడ గలిగెను కాని యాటవిక నాయకుఁ
డును మున్నొక్కసారి శ్యామసుందరుని లోపముఁ గాదిన
వాఁడును శాయాజీకిఁ గుడిచేయి యయినవాఁడును, నగు
గండాభిల్లున్న స్థానము జస్వంతరావు వెదుకఁగా వానిని బట్టు
కొనిన తనజన్మము సార్థకమనియు నతఁడు చిక్కినతోడనే
భిల్లులు కోఱలు దీసినపాములవలె లొంగుదురనియు నందు
శాయాజీ యసహాయుఁడయి రాణికి లోఁబడుననియుఁ దలఁచి
గండాభిల్లు నిమిత్తము సమస్త ప్రయత్నము చేయసాగెను.
భిల్లువంశమునకు జస్వంతరావు వ్యాఘ్రహేతుపంచానను
చందమునఁ దమవారి నతఁడు వేఁటాడుట విని గండాభిల్లు
సహింపనోపక శాయాజీ దగ్గఱఁ దాను గొలువుండి
శాంతియా భిల్లునిట్లు తన సేనఁ గూడ దేశనాశము జేయుమని
పంపెను. భిల్లులతోడనే కాని సామాన్యజనములు మహాక్షోభ
వించినట్లు బహుదురాత్మ్యంతో నసేన గూడియుండినది.
గ్రామములపైఁ బడినదాడి భిల్లులకుఁ బాసిన పిల్లలతోను
మగలకుఁ బాసిన భార్యలతోడను దినుట కన్నము లేని బీదల
తోడను దేశమెంత క్షోభపడెనో యనూహ్యమైనంత క్షోభ పడ
సాగెను. కాని లయకాలరుద్రుఁడయిన జస్వంతరావును
మృత్యుస్వరూపమూర్తియై కొన్న తెలుఁగున గృష్ణవంశపు నొక
యోధపురుషుఁడును గలిసి విధివిరామము లేక శతసహస్రములుగా
వారిని యమాలయమునకు నంపుచుండిరి హరిహర పాండ్యాజీ
సీతారాను శాయాజీకిని వివాహము జరుగు ముహూర్తము

నాలుగు దినములున్నదని చెప్పినతోడనె గండాభిల్లు తాంతియాను వెంటఁబెట్టుకొని జస్వంతరావుయొక్క ధాటిని చవిచూతమని తనకొండవిడిచి తక్కిన భిల్లులకును రాణిభటులకును గయ్యములు జరుగు స్థానమునకుం జనెను. ఆ స్థలమున కరిగి మొగమునఁ గన్నులకు మీఁదఁ జేయిపెట్టుకొని యతఁడు పాఱఁజూచునప్పటికి నిరువదిమంది గుఱ్ఱపు రౌతులతోఁ బోవుచున్న యొక యోధుఁడు దూరమునఁ గనఁబడ తాంత్యా "అతఁడు జస్వంతరావని తోఁచుచున్నది. మన మీసమయమున వాని నెదుర్కొనఁజాలము. నీవు పోయి యీచుట్టుపట్లనున్న మన వారినందరిని సిద్ధముగ నుండుఁడని చెప్పుము" అని వాని నంపి తా నొకగుహలో డాఁగెను. తాంత్యాభిల్లు తన యజమానుని సెలవు ప్రకారముగ సమీపమున నున్న పల్లెల కరిగి భిల్లులకు గండా వచ్చినవార్తన్ తెలియఁజేసి మరల నాగుహావైపు పోవుచుండెను. ఇంతలో నిరువదిమంది గల యాసమూహము గుహవద్దనిలిచి నలుదెసలు పరికించునప్పటికి తాంత్యాభిల్లుని జూచియున్న యొక భిల్లుఁడు గనఁబడ "అదె భిల్లుఁడు! అదె భిల్లుఁడు వచ్చె" నని యఱచిరి. తోడనే జస్వంతరావు మార్గాయాసమున నదివరకు మిగుల వసివాడిన కృష్ణపంతును గుహాముఖమున నొక చెట్టుక్రింద నిల్పి తాను దక్షిణభటులును గలసి యాభిల్లునిదెస కరుగ నతఁడును లేడివలె దాఁటులు వైచుచు ముండ్లపొదలను రాతిగుట్టలను నవలీలఁగ దుముకుచు వీరికిఁ జిక్కక పరుగెత్త సాగెను. ఇచ్చటఁ గృష్ణపంతొక్కఁడును వృక్షచ్ఛాయ విశ్రమించుటఁ జూచి

గండాభిల్లు మెల్లగ నీవలకు వచ్చి "తమ రేటినిమిత్త మిం దున్నవారు స్వామీ" యని వానిని బలుకరింప నాతఁడు "భిల్లులనిమిత్తమై మేము వచ్చినాము. గండాభిల్లును నీవెఱుం గుదువా? అతని నప్పగించిన పక్షమున నీకపాయము లేకుం డఁ జేసెదను" అని కృష్ణవంతు ప్రత్యుత్తర మిచ్చెను. అం తట గండాభిల్లు "స్వామీ! గండా యింటికి ముందె యీ ప్రాంతములకు వచ్చినాఁడు. ఒకసమయము క్రిందట మీరు వచ్చితిరేని నేను జూపియుందును. అయినను వాఁడీ గుహలో నుండి వచ్చును. నా వెంట రండి" యని యాతని నా గుహా ప్రవేశము జేయించి యందతని నొకరాతిపైఁ గూర్చుండఁ బెట్టి యెవరయిన వచ్చుచుండిరేమో యని మరల నొక మారు గుహాద్వారమునకు వచ్చి యొరులు వచ్చుట లేదని సంతసించి లోనికిం జనెను. ఇచట పరధ్యానముగ నున్న కృష్ణ వంతును బలిమిని వెనుకకుఁ బడద్రోసి తన మొలలో నున్న సూరకత్తితో నాతనిముక్కు గోసి యొక చెవిలో నొకభాగము ఖండించి "యోరీ దురాత్మ! నేనేరా గండాభిల్లును. నన్నుఁ బట్టుకొనువారు మీరాగా" యని తక్షణ మాగుహను విడిచి కొండమీఁద కెగఁబ్రాకి తనయొంట బ్రేలాడుచున్న గొర కొమ్మును విపరీతమయిన విధమునఁ జెవులు గింగురుమను నట లొత్తెను. ఆకొమ్మునూదుట యానవాలుగఁ గొని యాప్రాంత వాసు లగు భిల్లులు మరల నొకకొమ్ము నొత్తి ప్రతిధ్వని చేసి పుట్టలో నుండి వెడలు చీమలవలె నొకవరుసగ రెండుమూఁడు వందలమంది గండాభిల్లున్న దెస వచ్చిరి. శాంతియాభిల్లు తమ కాళ్ళ గొల్పి చిక్కసందున జస్వంతరావు తన చిన్న సేనతోఁ

గూఁడ వెనుకకుం దిరిగి గుహాముఖమున బోసిముక్కును దెగిన చెవియును గల్గి స్రవించు రక్తముతో బాధపడుచున్న కృష్ణపంతును జూచి తెల్లబోయి స్పష్టముగఁ దెలియనివాని ముక్కు మాటలవల్ల గండాభిల్లు చేసిన పరాభవము నెఱఁగి క్రోధోద్దీపితుఁడై యుండ నింతలో గుమిగూడిన భిల్లులు కొండమీఁదనుండి వీరిమీఁద సమ్మెలవర్షములు గురియింప నారంభించిరి. మూఁడునూఱుల మందితో నిరువదిమందికి యుద్ధము సేయుట మృత్యుసన్నాహము చేయుటయే యని జస్వంతరావు స్పష్టముగ నెఱిఁగియుఁ దాము వెన్నిచ్చి పాఱినచో వారు తరిమికొట్టి మొదలే బ్రతుకనీయరని తుపాకులతోఁ గొంత యుద్ధము చేసెను. ఇట్లు జరిగిన కయ్యమున మహారాష్ట్రులింతుపాకిదెబ్బలు తిని ముప్పదైదుగురు కంటె నెక్కువ [illegible] గల భిల్లులు నేలపాలయిరి. జస్వంతరాయని బలములో సగము కంటె నెక్కువ హతులైరి. అంతట జస్వంతరావు రంగము విడిచి పోవఁ జూచుచుండ దూరమున నాతనిసేనలో నొక భాగము వానిని వెదకికొనుచు వచ్చుచుండెను. ఆ బల దృగ్గోచరము కాఁగా భిల్లులు పిట్టలవలె తుఱ్ఱున గొండమీఁద నుండి నానాముఖములఁ బారి యదృశ్యులైరి. ఇట్లు పూర్వము లక్ష్మణునిచే శూర్పణఖకు జరిగిన పరాభవమే గండాభిల్లుచేఁ గృష్ణపంతునకు జరుగ నాతఁడు యుద్ధమును మాని సిగ్గుచేఁ దనవికలాంగత తనకే యసహ్యకరముగఁ దోఁచ మెల్లగ నింటికిఁ జనెను. గండాభిల్లు తాంతియాను గూడుకొని మరునాఁడు సాయంకాలమునకు శాయాజీహోల్కారు నారి సుముఖమునకు వచ్చి తన పూర్వోద్యోగముఁ గైకొనెను.

అట నింబపురమున దౌలతరావు రసపుత్రులతోఁ గలిసి యహల్యాబాయి సైన్యమును నోడింపవలెనని యెంత ప్రయత్నము సల్పుచున్నను మహారాష్ట్రులీముట్టడిలోఁ బైచేయి గలవారుగ నుండిరి. శోమోజీరావు రాజపుత్రులకుఁ గావలసిన ప్రతిసహాయముఁ జేయుదునని వారిని బిలిపించి తనలంచము వారు సత్వరముగ నందఁ జేయుచుండెనని వారిపై నలుక బూనెనేకాని తాను వాగ్దానమొనర్చిన సాయము వారికిఁ దానొనర్పఁజాలనందుకుఁ జింతిల్లఁడయ్యెను. శోత్యాలు వద్దనుండి యేసహాయము లేకున్నదని రసపుత్ర ప్రభువగు నుదయపురరాణా వారు భిల్లులను శాయాజీనైనఁ దమకుఁ దోడుగ నిప్పింపుమని దౌలతరావును బలుమారడుగుచువచ్చినను శాయాజీ యపరియోజనుఁడయి వారిని బిలిచిన మును పున్నగోడు చెడుననియు భిల్లులాటవికులగుటచే దేశమును గొల్లగొనుటకే యర్హులు కాని నిల్చి కోటలు ముట్టడించి క్రమమయిన యుద్ధములు చేయుటకుఁ దగరనియు నెఱిఁగి వారిని రప్పింపఁ దలఁచుక యట్లున్నచోఁ దనకు సేమము లేదని యిదిగో వచ్చెద రదిగో వచ్చెదరని జేపు మాపని కాలయాపన మొనర్చుచుండెను. రసపుత్రుల కాగ్రహము వచ్చి తన్నెపుడు తుద ముట్టింతురో యని భయము గలిగి వారి నతఁడు వదలఁ బ్రయత్నించెను. కాని వారాతనిని దాఁటి పోనీయక వేయికన్నులతోఁ గాచుచుండిరి. ఒకవేళ నే మాయోపాయము చేసియైన నీబంధనమునుండి వదిలించుకొని పోవుదమన్న నీవల జస్వంతరావు భిల్లుల నిర్మూలముగ

నోడలు దాఁచుకొనక పని చేయసాగుటచేఁ దనకు వారికడ
నేమియుండ దనమాట నిశ్చయమగునని తెలిసికొని యక్కడికిఁ
బోవుట యవివేకముగ నెంచి యెట్లైనను దనపుత్త్రునితో
సంఘటన యుక్తమనుకొనెను. తనపుత్త్రప్రభు వాడినమాటల
తప్పని పురుషుడని బాజీరావునకుఁ దాను వాగ్దానముచేసిన
వేయిపరాలును ఖేతాళసింగు చేతికిచ్చి యుంపినను జీతముల
మారి తనమును నక్కనిజంపి ఘట్టిన ఖేతాళుఁడా విత్తము
తానె యపహరించి గోమాజీరాయని కిచ్చినట్లు రాణాకు
విన్నవించెను. గోమాజీరావు కడనుండి ఖేతాళసింగు దగ్గరకు
రాయబారమంపబడిన వామనభట్టు మెల్లగాఁ గోటలోఁ
బ్రవేశించి కొత్త్వాలు కీయవలసిన సొమ్మునిమ్మనియు సొమ్మి
చ్చినవెనుక నెంతయు సహాయము జేయుననియు వానినడి
గెను. ఖేతాళుఁడాతని పలుకులు విని "ఓయీ, వామన
భట్టూ గోమాజీరావునకు నేను సొమ్మిచ్చుటకు వాఁడు
నాకుఁజేసిన సాయమేమి? నేనొక్క దమ్మిడీయైన వాని
కీయను. నీకు నూరురూకల నిచ్చెదను. నీవీసొమ్ము దీసికొని
యీసంగతి రాణాకుఁ దెలియనీయకుండు" మని వాని నోడఁ
బఱచి వానికి ముందె పదిరూకలనిచ్చి తక్కినది తరువాత
నొసఁగఁగలనని చెప్పి వానిని సమ్మతింపఁ జేసెను. తరువాత
దొంతరావు రాణాను దర్శించి శాయాజీ మహారాజు పక్ష
మున నహల్యాబాయికి సందేశమంపుట కర్తవ్యమనియు తన
పుత్త్రులు శాయాజీతోఁ గలిసిరని విన్నచో రాణి తప్పక
కోరిన పద్ధతుల ప్రకారము నొడంబడిక గావించుకొనుననియు
వామనభట్టు రాయబారిగ నగుఁ దగినవాఁడనియు జెప్పఁ

బలికి రాణాతోఁ జెప్ప వలసినయంశముల నెల్ల మనస్సునకు నాటఁ జెప్పి వామనభట్టును రాణాయును మతిమీఁదఁ దగు పరివారముతోడను జెండాలతోడను రాయబారముంపెను. వచ్చి యహల్యాబాయియనుమతిని నామె అజారముఁ బ్రవేశించి వామనభట్టు ప్రాణముల నగ్గఁబట్టుకొని భయపడుచుఁ గూరుచుండ జమానుఖాను మొదలగు తురకలు పదుగురు తుకాజీ శివనానా మొదలగు సేనాధిపతులు రాణి బరివేష్టించి యాసందేశమును వినఁగోరిరి. అంతట రాణి మొగము జూచి వామనభట్టిట్లనియె. "అమ్మా! శాయాజీ హోల్కారు గారు దమవద్ద కంపినారు. ఇమారు రాజ్యమును మీకు శేషమైన భాగ మీయుమనియు సర్వస్వము తమ పాలిట జనకులగు మలహారురావుగారిదే యగుటఁ దమకే రావలయు ననియు మనోవృత్తిగ మీకుఁగొన్ని జాగీర్ల నిచ్చెదమనియు రాజ్యము వదలవలసిన దనియు వదలకున్న రణమున దాము రసపుత్రులతోఁ జేరుదు మనియుఁ తమతో మహారాజుగారు మనవిచేయుచున్నారు. రాజపుత్రులకుఁ గూడ నాల్గవవంతు రాజ్యమొసంగవలయు నఁట. దీనికుత్తరము జెప్పి నన్ను సత్వరముంపవలయు నని ప్రార్థించుచున్నాను." అని చెప్ప నహల్యాబాయి నవ్వి "మీ మహారాజుగా రెందున్నారు? వారు రాకగపడుదురా?" యన నాతఁడు "చిత్తము వింధ్యపర్వతములలో నున్నారు తల్లీ" యని ప్రత్యుత్తర మిచ్చెను. ఇచ్చునప్పటికి జమానాఖాను వెనుకపాటున వచ్చి వామనభట్టుయొక్క భుజదండము గట్టిగఁ బట్టుకొని రాణితో

పై జూచి మెల్లగా నాతనితో నిట్లనియెను. "ఓరీ కుఱ్ఱవాఁడా ! నీవు నాకొక కార్యము జేయవలయును. సీతను నాకిచ్చి వివాహము సేయుటకు గండాభిల్లుని మొదలగువారు నిశ్చయించినారు. కాని యీమె కిష్టము లేకట్లు నీ వీమెతో బలుకవలయును నీ వీమె యొద్దకుఁ బలుమారు పోఁగలుగుచుందువు నేను త్వరపు జేసెదను నావంటి మహారాజు చేబట్టి సుఖింపగలుగుట యీమె కెన్ని జన్మములకైనను దొరకునా? ఇక్కడి పర్వతము మీఁద నొంటరిగ నేనుండుట యీమె కలక్ష్యముగనున్నది కాఁబోలును. రేపు రాజ్యము స్వాధీనమైన తరువాతఁ దాను రాణి కావచ్చును. వెండి గొలుసులుతూఁగుటయ్యాలలో దుల కేనిరత్నభూషణములు ధరించు యోగ్యత కామె నోచుఁకొన్నది కనుక నే తన వంటిదానిపై నావంటి మహారాజును ననురాగ ముదయించినది. నాకు శ్రీకొల్హాపురమహారాజుగారు సింధియామహారాజుగారు పిల్లలనిచ్చెద మని వర్తమానమంపినారు కాని నామనస్సీమెపైఁ దగిలి యున్నదని ఈమె నన్ను నిరాకరించిననుబలిమిచే నైన నేనీమెపొందునొందక మానను కాఁబట్టి యీవివాహమునకు సమ్మతింపు మనియు ముందుగా నేను దానితోఁ గొన్ని రహస్యములు మాటలాడవలయును కనుక సమయమేర్పంగ జేయు మనియు నాకుమెతో నాపలుకుగా మనవి చేసి యొడఁబరచి రమ్ము. ఇది యేరికి దెలియనీయవలదు అని మహారాజు నుడువ శాజీరావు కొంచెము యోచించి "మీ సేవకుడ నగు నేను మీకుఁ బ్రియము జేయనా? ఆమెను హరిహర పాండ్యాజీ కూడ మోహించి యున్నాఁడు. వానిని మీరు రహస్యముగఁ గడతేర్తురేని యీమె మిమ్ము దప్పక వరింపగ

లదు సూఁడీ యనివిన్నవించుకొన మహారాజుబ్బి యీవేళ సాయంకాలముననే హరిహరునకు స్వర్గసుఖమిప్పించెదమూను నాశ క్రియని ప్రతిన జేసి కత్తి వానిని లోనికిఁ జనమిమ్మని భిల్లులతో జెప్పి మదనాయత్త చిత్తుండై తహతహ బొందుచు శాయాజీ హరిహరుని జంపుటకుఁ గడఁగుచుండెను. జస్వాంతరావుచే దనబలము ముక్కముక్కలుగ ఖండింపబడుటకు వగచి గండాభిల్లు ప్రభువును దమము దుఃఖోకలఁ గూర్చి కఠినముగ నతనిఁ దలచి వచ్చి గుడారము సొచ్చి యిట్లనియె. "మహాప్రభూ ఏలినవారికి బట్టాభిషేక మయినదిమొదలు జస్వంతరావు మాచుట్టములును మేకపోతులు నరికినట్లు నరుకుచున్నాఁడు. దౌలతరావు త్వరలో నత్తుననిచెప్పి యీవరకు రాఁడయ్యె. మేము దోఁచుకొనివచ్చిన ద్రవ్యమంతయువ్యయము వేసి హాయిగాఁ బిండి వంటలతో మీరు మృష్టాన్నభోజనము సేయుచు మానిమిత్తము శ్రద్ధ చేసినారు. కాని మీరు పరాక్రమవంతులనుకొని యింతమహాపదవి మీకిచ్చితిమిగాని మొదటనే యింతవారగుట దెలిసినచోఁ బట్టము గట్టకుందుము. మాతో మీరుకలసి యుద్ధమునకు వచ్చెదరా లేదా? యని నిష్ఠురోక్తులు నాడి భిల్లుడు నిలువ శాయాజీ వానివంక న్నెత్తి చూడలేక తలవంచి మెల్లగ నిట్లనియెను. "నేను మిమ్ము నడపించి మీకు సేనానాయకుఁడనై రాజ్యముఁ గొన యత్నించుచుండఁగా నన్నిట్లాడఁ దగునా? వివాహమైనతరువాత కత్తిగట్టి యుద్ధముసేయవలెనని యున్నది అదియటుండ హరిహర పాండ్యాజి పై రాణీతో నేరములు చెప్పుచున్నాఁడట ఇతఁడున్నపక్షమున మనము నెగ్గజాలము. నీవి

రాత్రి వీనిని గడతేర్చిన బెడ్డియైనవెనుక మనమరుగుదము అని చెప్ప భిల్లుఁడు గోపముతో గన్నులెఱ్ఱజేసి యుద్ధమైన తరువాత నీవు వివాహమాడవచ్చును. ముందుగా వద్దు. అదిగాక యీనగరమున నా రెండవకొడుకును నాకు జయము కలుటకై కాళికి బలియిచ్చుచున్నాను. బలియైన వెంటనే మనము వెళ్ళినచో జయమే కల్గును. తేపు తప్పదు. హరిహరుఁడు మన పైఁ గూర్చి లెన్నఁడు బన్నములుఁ జేసెనులే యని గుడారము వెడలి పోవలయును జనెను. అతఁడరిగిన వెంటనే బాజీరావు మహారాజువద్దకు వచ్చి నిలిచి సంతోషముతో "స్వామీ మీరు చెప్పినట్లు నీతితోఁ జెప్పినాను మీవంటి పవిత్రాత్ముని మహారాజును జెట్టకట్టుటామె కష్టముగ నుండక పోవునా? అప్పటికి నామె యొప్పుకొన్నది కావున మీరు ఆ గుడారమునకు రావలదనియుఁ దగ వేషము వేసికొని యీ గుడారమునకు రాత్రి వత్తునని యు జెప్పుచున్నది మీరు నిశ్చింతముగఁ జెర విడిపింపవలయునని జూచి, లేకున్న నీవిధి చక్కఁ జేయును అని కర్ణానందకరముగఁ బలుక మహారాజు యొక్క శరీరము పులకలెత్త మనోరథసిద్ధి నేఁటికి గదా చేకూరును యని యానంద మొందుచు నాఁటితో నిన్నివేళ సాయంకాలముననే చెరవిడపించి కొంపెదను భయపడకు నీ మేలు నేను మరువఁజాలను మిత్రుడా! యని గాఢాలింగన మొసర్చి యభ్యంజనము చేసి నూతనవస్త్రాలంకృతుఁడై సూర్యుఁడెపుడస్తమించునా యని పరితాప మొందసాగెను. ఒకమారు బాజీరావును బిలిచి

నీమాటలు నాకు నమ్మకముగ లేవు. ఆమెచే నట్లుసమ్మతి మని పలికింపుము అని వేడుకొనుటచే గుడారము ప్రక్కకు మహారాజును గొనిపోయి బాజీరావు "సీత నీవిందాక చెప్పి నట్లు చేయుదువుగా యని లోపలనుండి కేక వేయు నామెయు నిశ్చయముగల చేసెద సంశయమేల? యని మృదుమధు రస్వరముతో బ్రత్యుత్తర మొసంగెను. అంతట గుండె దుడుకు తీరినందున శాయజీరావును బంపు ప్రయత్నము చేయుచు దౌలతరావునొద్దకు నాతని నంపెదనని గండాభిల్లుతో జెప్పి యొడంబఱచి పల్లకిని బోయలను సిద్ధముగఁ జేసెను. ఇంతలో సాయంకాలమైనందున సీత బాజీరావు చెప్పినచొప్పున మాట దప్పకుండ నతిక్రమింపఁదలంచి చక్కని తెల్లయిజారును దట్టిదే యంగరఖాయును ధరించుకొని చేతనొక ఖడ్గముంబూని తన గుడారమునుండి సమయము బ్రతీక్షింపఁ దొడగెను. ఆ రాత్రి సీతనిమిత్తము శాయాజీని సంహరింపఁ దలంచి హర హర పాండ్యాజీ రెండు జాములరాత్రి యైనతరువాత గాఢ నిద్రాసమయమున వానిఁ దుంపఁదగు నని మునుగాఁ దాను నిద్రించుచుండెను. ఇంతలో గండాభిల్లు గండ్రగొడ్డలి భుజముపై వేసికొని యెవరితోడఁ జెప్పక హరిహరుని గుడారము జొచ్చి నిద్రాసక్తుఁడై తలనిండనున్న కోర్కెలచే గడియ కొకస్వప్నము గనుచున్న యానిర్భాగ్యునిఁగని గొడ్డలినెత్తి సత్తువ మీఱ నాతని కంఠభాగమున నొకదెబ్బ దీసెను. వెంటనే శిరమును మొండెమును వేరుగఁ దొలగింపఁబడ మొండెము కొట్టుకొనుటయు నెత్తుఱురుధిర ప్రవాహము గుడారము నిండుటయు భిల్లుని నయనములకుఁ బర్వము సేయ నాతఁడు

జుట్టుపట్టుకొని చచ్చిన వానితల యెత్తి తిన్నగా శాయాజీ యున్న గుడారమునకుం జని వానింగని "చూడు నీహరిహరుఁ డెట్లున్నాఁడో!" యని యారక్తసిక్తమగు బుఱ్ఱ వానితొడపైఁ బెట్టెను. అదిరిపడి శాయాజీ లేచి గడగడ వణఁకి భిల్లుఁడలుక వహించెనని దనపని యట్లయగుటను తలంపునఁడికిఁ దట్ట మెల్లగా "నీవు సాహసుఁడవు. మంచిపని చేసినావు. నీవంటి వానినెందు జూడఁలేదు. మన్నెసుల్తాను బిరుదు నీకుఁ దగు సుమీ" యని వానిని సమొనర్చి చల్లనిమాటలతో సాగనంపితను

జానెకు హరిహరుఁడు ధనమును విడిచి, సీతను విడిచి ప్రాణములు విడుచుటయు, సీత తనపొత్తున కంగీకరించుటయు, శాయాజీ బాజీరావును ముందుగఁ జెఱ విడిపించి పంపఁ దలఁచి పల్లకిఁ దెప్పించి బోయల సిద్ధముజేసి సీతతో మరల మాటలాడుచున్న బాజీరావును బిలిచి పల్లకి నెక్కుమనెను. వెంటనే గుడారమునుండి యొక విగ్రహము వచ్చి యందుఁ గూర్చుండ బోయలొక్క ముహూర్తములో వానిని మోసికొని పోయిరి. అట్లు బాజీరావును బంపి సీతనిమిత్త మెదురు చూచుచు శాయాజీ మదనతాపము నొందుచు మాటిమాటికి నామె వచ్చుచున్నదేమో యని గుడారము వెడలివచ్చి చూచుచు ఉత్సాహము నొందుచుండ నింతలోఁ దనమనోరథ సిద్ధిఁ జేయఁ దలఁచిన పారిజాత వృక్షమువలె సుందరవదనారవిందము చీఁకటిగుడారమున వెన్నెలలు గాయ గావలియున్న భిల్లులు నిద్రించిన వెనుక నాపురుష విగ్రహము మహారాజు యొక్క గుడారము బ్రవేశించెను. ప్రవేశించిన తోడనే

యెదురుగనేగి శాయాజీ యాభువనమోహ విగ్రహమును జేయి పట్టుకొని ముద్దుపెట్టుకొని తన మంచమునొద్దకుఁ దీసికొని వచ్చెను. అంతట పురుషుఁడును మెల్లగవచ్చి ప్రాణేశ్వరా! మిమ్ము వివాహమాడుటకు నాకు సందేహము లేదు. కాని మీరు యుద్ధములు చేయుట కరుగుదురు. యుద్ధమున మరణ మొందుదు రేమోయని నాకు భయము గలుగుచుండెడి యని పలికెను. హోల్కారామె పలుకులకు సంతసించి నేను యుద్ధమున కెన్నఁడును బోవను. భిల్లులను మోసపుచ్చుటకుఁ గయ్యము సేయుదు నని నే నంటినే కాని యామాట యబద్ధము. నిన్ను విడిచి నే నెం దరుగుదును? ఇన్ని దినములనుండి నేఁ జేయు ప్రయత్నములు సఫలము లయినవి ఏదీ యొక ముద్దుబెట్టు ప్రాణేశ్వరీ యని ముద్దు పెట్టుకొని చెక్కిలి నొక్కుచుండ నీ వేషధారి యాకామాతురుని చెల్లున నొక చెంపవాయఁగొట్టెను. యాదెబ్బతో శాయాజీకి కన్నులనుండి బాష్పములు రా నది తుడిచికొని మెల్లన నిట్లనియె. "సుందరీ! అబ్బా! ఇదేటి సరసమే గూబకదిలినది. మాటలతో సరసము కాని చేతులతో నేమిటే" యని యందలించి యాసుందరిని గౌఁగిలింపఁబోవ నాటక్కరి తన మొలలో నున్న బాకు దీసి శాయాజీని నేలఁ బడఁద్రోసి కుడిప్రక్క నొక్కపోటు పొడిచి తక్షణమే యేరికిం గనఁబడక యెటకో చనెను. శాయాజీ యాపోటుతో కెవ్వున కేక వేయుటచే నార్తారవము నాలకించి గండాభిల్లు గండ్రగొడ్డలి భుజముపై వేసికొని వచ్చి పడియున్న శాయాజీని జూచి యాశ్చర్యమొంది మెల్లగ వానిని లేవనెత్తి కారణ మడుగ నాతఁడు జరి

గిన వృత్తాంతము సవిస్తరముగ నీరసముతోఁ జెప్పెను. ఆ మాటలు చెవుల సోఁక గండాభిల్లు మహాగ్రహమునఁ గన్నొమలు ముడివడ రూక్షనిరీక్షణముల నాతనిఁ జూచి, "దురాత్మా! నాతోఁ జెప్పక నీవిట్లు చేసితివి కనుక నీకింతే కావలయును. నీకు జంపుట కాదు. నేను నిజముగఁ జంపి వేసెదను చూడు. నీవు నీచుఁడవు కాని రాజువు కావు" అని మాటలచే నొప్పించి జేతిగొడ్డలి నెత్తెను, అపరిమితబాధ పడుచు కాయాజీ యెట్లో లేచి భిల్లుని రెండుపాదములం బట్టుకొని నాతండ్రీ నన్ను రక్షింపుము. నన్ను నిష్కారణముగ దౌలతరావు గంగలో దింపినాఁడు. నాకేదైనఁ గట్టుగట్టి నా ప్రాణములు దక్కింపుము. అని జాలికలుగఁ బ్రార్థనలు చేసి యేడ్చుటకు మొదలుపెట్టఁగా, గండాభిల్లు గొడ్డలి డింపి నీకు నేను గట్టుగట్టును చావకుమని తిట్టి గుడారము విడిచిపోయి నీతికై వెదకి యామెను బాజీరావును గూడ గానక విసికి తన బస కరిగెను.

## ఇరువదియొకటవ ప్రకరణము

మరునాఁ డుదయమున మంగళతూర్య రావములు సేయంగ నహల్యాబాయి మేల్కాంచి కార్యములు నిర్వర్తించి మహోత్సాహ పూరితమానసయై కోటముట్టడి జరుపుచుండ జమానుఖా నామెకు సలాముచేసి రాధాకాంతరావు వచ్చి

యున్నాఁడనియు రాణిదర్శనముం గోరుచున్నాఁడనియు విన్న వించెను. రాధాకాంతరావుపై సంపూర్ణముగ కలుక వహిం చిన దగుటచే రాణి జమానుఖానుతో, "నోయీ రాధాకాం తుని మొగము నేనింకఁ జూడఁజాలను. అతని విశ్వాసమును గూర్చి మాకుఁ గల పిచ్చి నమ్మకము పోయినది. శ్యామసుం దరదత్తును వదలిపెట్టమని గోమాజీరావునకు జాబు వ్రాయు టయు రఘునాథరావుతోఁ దాను జేరి నాపైఁ గక్ష బూను టయు నాహృదయమున నాటినవి. అందుచే నాతఁడు నాకడకు రావలసినపని లేదు. రఘునాథ రావువొద్ద కరుగు మను రాదా?" యని యుత్తరువు జెప్పెను. చెప్పి ఖానుని వానికడ మీఁద పంపెను. ఖాను వృద్ధుండగు రాధాకాంతరాయునిపైఁ దనయేలికకు వచ్చినని ర్హేతుకాగ్రహమునకు విచారించి తన శక్తిలో నా కార్యము లేకుండుటచే నప్పటి కూరకుండెను. రాధాకాంతరా వీయలుకకుఁ గత మేమియుండునా యని కొంతతడవు విచారించి జమానుఖానుని బిలిచి తా సగిన దంత యాత్రలో జరిగిన విశేషాంశములెల్ల నాతనికి రహస్య ముగఁజెప్పి రాణిదయను సంపాదింపఁ బ్రయత్నలోపము లేకుండ నింబపురమునందే నివసించెను. అప్పటికి నింబపురి ముట్టడిలో రనపుత్రుల కంటె మహారాష్ట్రులే జయము నొందువారివలెఁ గన్పడుచుండిరి. రాణి కందుచే రాజ పుత్రులను జయింపవచ్చు నను ధైర్యముదయిం చెను. ఆమెకు ధైర్యమును శత్రువుల కధైర్యము నొక మారె జనియించినందున ఒండొరులను జయించుట

కుపాయములు వెనుకటివలెనె సురక్షితముగఁ జారిపోవుట
కుపాయము వెదుక నారంభించిరి రాజపుత్రసేవకుఁ డొక బడి
సామగ్రియై యుండువారలకెల్ల నోర్వఁజాలని చిక్కులఁ బడు
చుండిరి కోటలోపలికి నీటిచుక్కయైనఁ బోనియక యహల్యా
బాయి నీటియాధారముల నెల్లఁ గప్పించెను ఫిరంగులమూల
మున గోడ భేదింపఁబడి రంధ్రముతో నిండియుండఁ జొచ్చె
ను. అందుచేత నుకు జయము నొందునాశ లేశమైనను లేద
యి యహల్యతమతో సంధి చేసికొనె దని యుదయపురరాణా
వారు నిశ్చయించి జారిపోవుటకు మహాయత్నము నిర్ణయించు
కొనుటకు మొదలు పెట్టిరి. శత్రువుల బలమును గుట్టును దన
కుఁ జిక్కియుండున యహల్య వారి లక్ష్యలము లేకవారు లోఁబడి
నట్లు యోచించుకొని జస్వంతరావు గండాభిల్లును దక్కదక్కన
భిల్లుల నెల్ల దాదాపుగ నిర్మూలించినట్లు విని యొక్క శాయా
జిహోల్కారు ప్రమత్తుఁడై చక్కఁజేసికొననేయుమని నిశ్చయించిన
జమానుఖానుని పిల్చి యొకమూఁల పీనుగువలె నొదిగియున్న
వామభట్టునొటినండి మహారాజవసించు కొండ నానవాలు
చూపించి తనపరివారముతో బంపెను. నింబరపురమునకు శా
కోసు యొక వారపు ప్రయాణములోనుండి సందున జమాను
ఖాను రేయి బవళ్ళు నడచి శ్రమయనక యోగుయనక కొండ
లెక్కి వాఁగులు దాఁటి యరణ్యములఁ గడచి మూఁడవ దిన
మునకు శాయాజీ యున్నస్థానమునకు వచ్చెను. నాఁటిరాత్రి
శాయాజీ సరసమాడఁబోయి కత్తిపోటుదిని గండాభిల్లునొద్ద
నుండి సహాయము నందక కొంతసేపు బాధపడి తనపరిక్క గు
క్కలో నొకదాని గాల్చుమని చేసి తనగాయమునకుఁ గట్లు

కట్టుకొని మరియొకభిలుసాయమున మరికొంత యుపచారము చేయించుకొని గాయము కుదుర్చుకొనుటకు సమయము దొరకునని దనకు రాజ్యము గిరిపంక్తులందలి భిల్లువారినుండి పరతెంచి యేకాలమునైన ముష్టి యెత్తుకొనుటకు కవచ్చునని యుత్సాహముగావి చుచుండెను. పట్టాభిషేక మహోత్సవకాలమునఁ దన సేవించు భిల్లు నొక్కరొక్కరుగ దేశములపైఁ బడి జస్వంతరాయునిఖడ్గధారాగ్నికి మిడుతలగుటచేతను గొందఱాతని ధాటికి వెఱచి దూరదేశములకుఁ బారుటచేతను మరి కొందఱు వన్యమృగముల వలెఁ గొండగుహలలో దాగుటచేతను మరి జమానుఖాను వచ్చినప్పటికి రెండు మూఁడు వందలకంటె నెక్కుడు భిల్లులా పర్వతమున లేరైరి, ఆరాత్రి గాయమే తగులకయున్న బలవంతముగ గండాభిల్లు శాయాజీని దనతోఁ గూడ యుద్ధమునకుఁ దీసికొనిపోయి యుండును. రాజముద్రదర్శనము సేయువానికిఁ గూడ నమితమైన భయమును సాహస ధైర్యములు గలుగకుండెను. జమానుఖాను రాణిదగ్గఱనుండి సందేశార్థములు దెలుపవచ్చినాఁ డని విని యామె యొకటంబడిక చేసికొనుననియుఁ దనకు రాజ్యము పూర్ణముగ రాకపోయినను గొన్ని జాగీరు లయిన రాకపోవనియు శాయాజీ యువ్విళ్ళూరుచుండ నతనికి రాజ్యము గల్గినఁ దమకు నిలువనీడ చేకూరునని భిల్లులానంద మొంది ఖానుగారిని సగౌరవముగ నాదరించి సందేశము జరుపుటకు వారు నిశ్చయించిరి. శాయాజీయుఁ దనపట్టాభిషేక కాలమున ధరించిన దుస్తులను నాభరణములను దొడిగికొని శూరశిఖామణివలె మహారాజఠీవితోఁ దన గుడారమునఁ గూరుచుండ నింతలోఁ దన కరి

వారముతో జమానుఖాను ప్రవేశించి మహారాజును జూచి తనలో నవ్వుకొని తలయూఁచి సమర్యాదగా నమస్కారము చేసి యర్హాసనముపై నాసీనుఁ డయ్యెను. గండాభిల్లు గప్ర గొడ్డలిని బూని తన మహారాజయొక్క వామభాగమున నిల్చెను. అప్పుడు ఖాను హోల్కారుతో "స్వామీ! మీతో నేను గొన్ని రహస్యములు మాటలాడవలయును. మీభిల్లును ఆవలకుఁ బంపవలయును. మీకొక సందేహము లేకుండ నాతురక మహారాష్ట్రసేవకుఁ గూడ నావలకంపెదను. మీరట్లు చేయుదురా" యని మనవి యొనర్చెను. అంతట భిల్లుఁడు, మహారాష్ట్రయోధులు గుడారము బాసి దూరముగాఁ జన, శాయాజీయు జమానఖాను నిట్లు మాటాడిరి

జమా — దేవా! మీరు రాణిగారి విషయమున నేదో సదుపాయమును జేయవలయును. ఆమెకు ముద్దులు మూటగట్టు నొక కుమార్తె కలదు గదా.

శాయా — రాణికి నేను రెండుఁమూఁడు జాగీరులు మాత్ర మిచ్చెదను. నాకు రాజ్యమునంతయు నప్పగించి యిందూరునగరము విడిచి యామె యరుగవలసినది. ఇట్లు లొప్పుకొనకున్న నే నొడంబడికఁ జేసికొనను.

జమా. పాపము దిక్కులేని యాఁడుదానిని మీరింత శ్రమ పెట్టుట న్యాయముగాదు. మరి యే షరతులనైనఁ జేర్పరుఁడు.

శాయా — ముక్తాబాయిని నాకిచ్చి వివాహము చేసిన మొదల నేనామెను రాజ్యమునందుంచి యున్న వస్త్రము లిచ్చి కాపాడెదను.

జమా — పోనీ రాజ్యమంతయు మీ కామె వదలి వేసినచో మీరామె కేమి యిచ్చెదరు? మీ తోడను, మీ భిల్లులతో నేను నామె యుద్ధము చేయఁ జాలను.

శాయా — నేను నొక వేయిరూపాయల మనోవృత్తి నిచ్చెదను. అంతకంటె నెక్కువగా నే నేమియు సదుపాయము నామె విషయమునఁ జేయఁ జాలను.

జమా — ఆమె మిమ్ముఁ బెంచుకొన్నచో మీరు దత్తులగుట కంగీకరింతురా?

శాయా — ఏమో ఆలోచించి చెప్పవలెను. ఆమె నాకుఁ దల్లియగుటకు అభ్యంతరము కాదు.

జమానుఖా నెందుచేతనో కడుదీనముగా మాటలాడుటఁ జూచి శాయాజీహోల్కారు తనకు వారు జంకినారని యనుకొని గర్వించి యంతకంతకు నిర్లక్ష్యముగఁ బల్కనారంభించి యూవన తన బాహుబలమును దాను నుతించుకొని జమానుఖానుతో, "నోయీ నీవాడిన మాటలు మాకు మహానందమును గలిగించుచున్నవి. నీవు మాయెడ నింతభయభక్తులతోఁ బలుకఁబట్టి నిన్నిట్లు విడిచితిమి కాని కొంచెము గౌరవహీనముగాఁ బల్కితివేని నిన్నిక్కడ మట్టు పెట్టుదుము. నీవదృష్టవంతుఁడవు. చెడ్డటక్కరివి. ఎవరిదగ్గ నెట్లు మాటాడవలయునో పరిపూర్ణముగ నెఱుఁగుదువు సుమీ! యని ఖానునకు నిలువలేనంత యాగ్రహము పొడముటచే నాతఁడు దిగ్గునలేచి 'నేను మీపరాక్రమ మెఱుఁగుదును. మీరు చెప్పవలెనా?

యని చూచి రెండుభుజములు పట్టి గట్టిగ నొక్కి చేతిలో నున్న ఖడ్గము నూడఁబెరికికొనెను. తెల్లపోయి శాయాజీ నోరెత్తక యుండ "ఖాను నిన్ను రాణి తీసికొని రమ్మనినది రా" యని నేలకుం ద్రోసి రెండుచేతులు వెనుకకుఁగట్టి గుండెలపైఁ గత్తిమోపి, "దురాత్మా నీవు హోల్కారువా! నిన్నిపుడు నేను దూదమట్టించెద. నీకు దిక్కెవ్వఁడు...." యని యొక్కవేటున వాని నేయఁబోయి యంతలో నిలిచి రాణికాతని జీవముతోడ నుండఁగ నర్పించుట యుచితమని పల్లకిఁ దెమ్మని తన భటునకు నానతిచ్చెను. ఇంతలో నీసు దంభమును జూచి నూతిలోఁ బడిన వాని లాగు శాయాజీ వేసిన కేకలు విని గండాభిల్లు తన మూఁకలం దోడికొని తుపాకులను పరుగుపరుగున వచ్చెను. భిల్లుల చుట్టుపోవగాను సైరింపనోపక ఖాను యొక్క యంగరక్షకసేనలో నున్న ముప్పదుగురు మహారాష్ట్రులు నిరువదిమంది తురకలు నదివరకే తుపాకులలో మందు దట్టించినందున నొకపెట్టున వచ్చి గుడారపు గుమ్మముకడ నిలిచి భిల్లులను లోని కరుగనీయకుండా ప్రవాహము మహారాష్ట్రబలమునకట్టుచే నాఁకఁబడినందున శాయాజీ నిర్విణ్ణుఁడై భోరుననేడువఁ బ్రారంభించి తన్ను వదలుమని ఖాను ననేకభంగుల వేడుకొనెను. కాని ఖాను హృదయము రాజద్రోహుల విషయమున మాణిక్యమువంటి దగుటచే వాని దీనాలాపములు వాని డెందమును కరగింపనేరవయ్యెను. అప్పుడు కుపితులగు రెండువందల భిల్లులకును నేఁబదుగురు మహారాష్ట్ర సైనికులకును ఘోరయుద్ధము జరిగెను. మనుష్యులు మనుష్యులను గొట్టుచుండ ధుమ్ముధుమ్మున

ప్రేలు మహారాష్ట్రుల తుపాకులగుండ్లను రివ్వు రివ్వున వచ్చు భిల్లుల యెమ్ములను నొండొంటిని విచ్ఛిన్న మొందసాగెను. తుపాకినుండి వెడలిన ప్రతిసీసపుగుండు నొక్క నిండుప్రాణమును గొనుటచే దస్త్రైరావ్రచే హానియు కాక శేషించిన నిద్ర క్రియయూ సమయ్యెను. ఆదినమున నూరుగురు భిల్లులు యుద్ధరంగమునకు బలియైరి. ఒక తుపాకి గుండు గండాభిల్లుయొక్క చెవికిఁ దగిలి దూసికొని పోవుటచే నాతఁడు రణరంగమును విడిచి వెంటనే ప్రాణరక్షణార్థమొక కొండగుహలోనికిఁ జనెను. యజమానుఁ డరుగ గొఱ్ఱెదాఁటు వలె భిల్లులందరు నొకరివెంట నొకరరిగి యొకనిమిషములో రణభూమి నిర్మానుష్యముగాఁ జేసి శాయాజీయొక్క హృదయమును గూడ ధైర్యశూన్యమగునట్లు చేసిరి. మహారాష్ట్ర సైనికులు మాతుంగముల భిల్లుల పైఁబడి వారికడనుండిన గొఱ్ఱె కొమ్ములను నేనుఁగు దంతములను మొదలగువానిం దోఁచుకొని యుద్ధాంతమునను జరుగవలసిన పూర్వాచారముగ దోఁపిడున్న దర్శించిరి. తరువాత నొక ప్రాంతపల్లకిలో శాయాజీని గూర్చుండఁబెట్టి జమానుఖా నాస్థానమును విడిచి ప్రయాణము సాగించెను. ఈ ప్రయాణములో శాయాజీ తన యనిష్టదశనుండి తప్పించుకొనుటకుఁ జేత నయినంత యత్నము సలిపి కృతకృత్యుఁడు గాక ప్రాణములు వారి కప్పగించి యీశ్వరునిపయి భారమును వైచెను. జమానుఖాను మూఁడు దినములకు నింబపురమునకుం జని తన ప్రజ్ఞాదికమును దెలియఁజేయ నాతఁడు వానిని బహువిధముల మెచ్చుకొని యొక రత్నపుటుంగరమును బహుమానముగ నొసఁగి

తన యెదుటకు శాయాజీని రప్పించెను. నిర్జీవ ప్రతిమ లాగున బద్ధుడై యున్న వానిని జూచి రాణి, "మా జాతినిట్టియవస్థలో నుంచుట నా కిష్టము లేదు. నాతో సరిసమానుఁడు నాకుమనోవృత్తి నియుగ జాలినవాఁడు ఈతనిని గౌరవింపక యవమానించి నా మనస్సు తాళ దనిపలికి బంధమోచనము జేయించి సమోన్నత పీఠముపైఁ గూర్చుండఁబెట్టెను. ఆ పలుకులను శాయాజీ దమాను ఖాను చేసిన యన్యాయమును గూర్చి రాణితో ముచ్చటింపఁదలంచి రాణి తన పక్షమున నున్నదని నమ్మి యిట్లనియె "మన మిరువురము సమానులము. ఏకకుటుంబములోఁ జేరిన వారమయితిమి. అట్టి నన్ను నాగౌరవము నెంచకుండ నీనౌకరక చేతులు విఱిచి కట్టి యిట్లపుడు తెచ్చుట మీ రంగీకరింతురా? ఈతఁడు నన్ను మీ సన్నిధికిఁ దెచ్చుటలో నీతని గొప్ప లేదు! నేను రావలెనని కోరుచుండఁగదా నను మీచే సన్మానింపబడుటకు నిట్లు పరాభవించినాఁడు. తల్లి అనిమనవి యొనర్ప రాణి తేఁ యూరిచి సరే యావిషయమును నేను విచారణసల్పెదగాక! నీ నాగుడారమును నుండుము. అనియానతిచ్చి విచ్చుకత్తులతో నుండు పచ్చితురకలఁ గావలియుంచి సురక్షితముగ నాతని నాగుడారమున నుంచెను.

## ఇరువదిరెండవ ప్రకరణము.

శాయాజీహోల్కారను నామధేయము నొసంగి యీ కుత్తవానినిబయిఁకిఁ దెచ్చుటలో దౌలతరావుయొక్క ముఖ్యో

దేశమొక్కటియు జరిగిన దొక్కటియు నయ్యెను. క్రొత్త హోల్కారునకుఁ బట్టాభిషేక మగుటఁ బ్రజలు వినినతోడనే యహల్యాబాయిని విడిచి తమవద్దకు వత్తురనియు రాణికిఁ గష్టము గట్టరనియు రాణి చేతి రాజ్యము విడిచిపోవుననియు నతఁడు గొంతెమ్మకోర్కెతో నీకార్యము గావించెను. తరువాతఁ బ్రజలు తన మొగము జూచి పోవుటయు గొందరు మరాచారులుమాత్రము తమ్ము జేరుటయుం జూచి దౌలతరావు బెంగగొని రసపుత్రులతోఁ జేరి వారికేవిధమైనసాయము నేయఁ జాలక పట్టినపట్టు వీడవలదని ప్రోత్సాహము సేయ దొడంగి మరల శాయాజీ యొక్క మొగముజూచి భిల్లుల దలపెట్టక యేమి చేసినను రాజపుత్రులే దిక్కని వారినినమ్మి రాణిపయిఁ దిరుగుబాటుచేసిన కొందరనామధేయులమాటలు నమ్మి రాణిత్రాణ దెలియక యట్లు దేశముపై దండువిడియుటకును లంచము దిని గోమాజీరావు సహాయ మొసగెనందులకు దౌలతరావు మాటలు చెప్పుటయే కాని చర్యలు జరపలేనందులకు నుదయపుర రాణావారు మిగుల నొచ్చుకొనుచుఁ బశ్చాత్తాపము నొంది యాదుదానిని గెలువలేకవచ్చినాడని రాజపుత్రకుటుంబములు తన్ను దెప్పునని విచారింపసాగెను. అట్లు పశ్చాత్తప్తులగు మహారాణా వారిపాదసన్నిధి వచ్చినిల్చి ఖేతాశిసింగు నమస్కరించి యిట్లనియె—"దేవా! ఈ దౌలతరావు మన కుండి యేమి లేక యేమి? ఈతనినేఁ సాగనంపరాదు. అదియటుండ నేను దమకార్యమునకుఁ బ్రాణములనైన విడిచెద. నేను గోమాజీరావు మాటలు

నమ్మి నిన్ను ప్రోత్సాహపెట్టి యిటకుం దీసికొనివచ్చితి. అందుచే నేని రాత్రియొక యద్భుతముజేసి తమకు జయము చేకూరంజేసెద. నాకు ననుజ్ఞమాత్ర మొసంగుడు. అనిరాణి చెవిలో నొకరహస్యముజెప్పి యాతనిసమ్మతి వడసి తనప్రయత్నముసం దానుండెను. అంతట నైరాసలము పల్లారెనదని యెఱింగింపనోయన నెండ చండతమూన యగుపడనయ్యెను. దేశమంతయు వేంపి మాడ్చిన శత్రువుమండల మిదెక్రుంకుచున్న దనియుదుఃఖజలధిమునుంగుచున్న దనియుంజాటునా భానుమండల మపర జలధిం గ్రుంకె, శత్రువుల చండతేజంబునంబవెనుక సన్మార్గవర్తులగుధవళయశుల నేకులుందురని వెల్లడిజేయు తెరంగున నంబరమున నక్షత్రకోటులుదయించె. అదికృష్ణపక్షమగుటచే వెన్నెలమాత్రము లేదయ్యె. ఆరాత్రిజాముసతరువాత ముక్తను నిదురబుచ్చి యహల్యాబాయిదగ్గరనున్న యాస్త్రీనిజూచి యమునా! నీకింతవిచారమెందుకు? ఈ యుద్ధం ముగిసినదిక నిక శివనానాను బిలిచి నీకుమారుని వదలించుటకు నేమియభ్యంతరమున్నదో యడిగెదను. నీవిట్లువిచారింపకు. ఆహా! నీకుపుత్రిపిసి మించిన దేదియు లేదుగదా. ఇన్నిదినములుగడిపితివి; ఈ రాత్రికూడ గడుపుము. నాకునిద్రవచ్చుచున్నది. నీవు మేలుకొనెదవా యనియడుగ "నమ్మా నాకు నిద్రవచ్చునా? ఇన్నిదినములనుండి యున్నమెట్టిదో యెరుగవు తల్లీ! నాకుం బుత్రభిక్ష బెట్టవేని యింక మృతినొందుదు సుమీ యమ్మా" యని రాణి పాదములపైం బడి కొంతసేపు విలపించి లేచి తనప్రక్కపై గన్నులు దెరచి పండుకొనెను. అహల్యాబాయియును ముక్త మనఃకంటకమైయోహోయుగగుండె పై

తుగా వచ్చి, "నీతోఁ గొంచెము పని యున్నది. రాణావారు నీతోఁ గొన్ని రహస్యములఁ జెప్పుచున్నారు. ఒకమారు కోటబురుజు మీఁదికి రా" అని భేతాళసింగు వానిం బిలిచెను. కోటబురుజు మీఁది కొంటరిగ నేగుటకిష్టము లేనివాఁడయ్యు నెట్లైన దక్షుఁడగా యని సింగు వెంట నిర్ణిమితస్థానమునకు విధిలేక నడచిపోయి దౌలతరావు వెక్కలేక బురుజుపై నెక్కి క్రింది కొకమారు తనదృష్టి బరపెను. వెంటనే మహానరకమువలె నగాధమై యున్న కందకమును దిక్కుని దెసల నావరించిన యంధకారమును మహారాష్ట్రునకు భీతిగలిగించినందున నాతఁడు గడగడ వణఁకఁజొచ్చెను. ఇంతలో భైరవసింగు వచ్చి వానిం గలిసికొని దౌలతరావుపై దాదాపుగ ప్రాణములు లేనివానిగ నొనర్చెను. వానిభయమును జూచి నవ్వి భేతాళసింగు "నీకింతభయమేల? నేను నిన్ను సహాయుఁడగుటకుఁ దీసికొనివచ్చితిఁగాని నీకు హానిచేయుటకుఁ గాదు. అహల్యాబాయి సైన్యమునఁ గలకలము పుట్టినది. వారు పరుగెత్తుచున్నట్లున్నారు చూడుము నా వ్రేలిచాయపై నిదానించి చూడు" అని రెండవ వ్రేలితో రాణిసైన్యమున్న చాయ నాతనికిఁ జూపెను. దౌలతరావు వెఱ్ఱివెఱ్ఱి చూపులఁ జూచుచు వానితో "వారు నాశనపడుచున్నారు పారిపోవుచున్నది నిజమే" యని యుత్తరమిచ్చునంతలో భేతాళసింగు భైరవసింగును మెల్లన గోకెను. తోడనే భైరవరూపుఁడగు భైరవసింగు ఖడ్గమును దీసి యొక్కవ్రేటున సకలసంహారకారణుఁడగు దౌలతరావు శిరమునుఁ దెగవ్రేసెను. మారుమాట

లేక మహాదుష్టుఁడు బురుజుపైఁ బడ భేతాళసింగు నిర్దయుఁడై గుబాలున నాతని నధోలోకమునకుఁ ద్రోసినట్లు కందకములోనికిఁ ద్రోసివైచి వెంబడనే యాతని స్థూలకాయము దడదడ దొర్లుచుండ భేతాళసింగు మహానంద మొందుచు వాని మొండెమును గన్నులపండువుగఁ జూచుచు భైరవసింగుతో "మిత్రుఁడా! లంచముసొమ్ము నసనమే యపహరించితిమని యీ దురాత్ముఁడు రాణితోఁ జెప్పునని నాకనుమానము గల్గి నది. అందుచేత నింతపని చేసినాఁడను. ఇక మనము నేఁడు చేయఁదలంచిన రెండవకార్యమును కరుగుదము రమ్ము" అని బురుజులు దిగి పాణిద్వారము దాటి కోట వెలువడిరి. అప్పటికి సరిగా రెండుజాములయ్యె. ఉభయసైన్యములయందుఁ గావలి గాచు భటులు దక్క తక్కిన వాండ్రందఱు నిద్రాసక్తులైరి. శత్రువులు పరాజితులై రేపో మాపో నింబపురమును విడిచిపోవుట కుద్యుక్తులై యున్నవారని విని యహల్యాబాయి సేనయంతయు నిద్రించుటయే గాక కావలి గాచు యోధులు గూడ నిద్రకు లోఁబడి కునుకుచును నులికిపడి చేతులతోఁ దుపాకులం బట్టుకొనుచు నోడ లెఱుంగకుండిరి. రాణి గుడారమున యున్న యమున యను నాసుందరి ఇమారరోగముచేతనో మరి యెందుచేతనో కునుకు లేక పలుమారు తనగదిలోనుండి రాణి గదిలోని కరిగి యహల్యాముక్తాబాయిని బరీక్షించి చూచుచు గుడ్డతలుపులం దెఱచి యావల కరిగిన యడుగుల చప్పుడగుచున్నదేమో యని యాలకించుచు సుస్థిమితము లేక తిరుగసాగెను. ఒకమారామె వీధిలోనికిరా జమానుఖా నామె యాత్రమును గని యేదియో నేఁడు జరుగనున్నదని

యమునాసమేతముగ లోనికరుగు నప్పుడే నారియొక పురుషుఁడు జోడుతుపాకులను మందుకూరి సిద్ధముగ నుంచుకొని యహల్య నిద్రించు గుడారమునకు వెనుకప్రక్కనున్న గుమ్మముచాటునఁ బొంచియుండెను. క్రొత్తపురుషుఁడొక బ్రభయుఁడు గుడారము నంతయుఁ బరికించి యొక మెత్తని పాన్పుపై శరీరమును మరచి జన్మాంతరాయము దలఁచుకొని వలువరించు ముక్తాబాయి ముఖారవిందముం గాంచి సేన కీర్క జోలికిఁ బోవను. ఇవ పసికూన యగు యామెను గెలిచి గాఢ కార్యాంశములఁ బలువరించుచున్న నోకమూ బ్రహ్మచర్య వ్రతము జరవుటఁ దెలియఁజేయు నొక చాపపై స్వేద బాహువు తలగడఁ జేసికొని పవ్వళించిన రాణిం జూచి, "యీమెయే మన రాణావారి హృదయశల్యమగు నహల్య. ఈమెను గడతేర్చెద" నని వెండిదీప స్తంభముపై వెలుఁగు దీపిక నుఫ్ఫున నూఁదివేసి యహల్యకు దగ్గర వచ్చి గుమ్మము ముందర కావలి యుండుమని రెండవవాని కానతిచ్చి మొదట ఖడ్గసాధనమున నామెను దునుమునఁ దలఁచి కత్తి యెత్తెను. కాని యొక్కపోటున కామె చావవచ్చుఁ జావకపోవచ్చు. చావకుండినచో నల్లరి యగుఁ జుమీయని యమున నను యానుకూలముగఁ జెప్పిన యాలోచనను బట్టి యాతఁడు తుపాకి నుపయోగింపఁ దలఁచెను. ఆ పురుషుఁడు తుపాకి బారు చేసికొని రాణియొక్క కుడివైపున మోకాళ్ళు నేలవాల్చి కూరుచుండఁ నాతనికి సరిగ నెదురుగ యమున సమయమునకు రాణిని గదలకుండఁ బట్టుకొనఁ దలఁచి రెండవప్రక్కను గూరుచుండెను. అంతట నాతఁడు తుపాకి రాణిగుండెపై గురిపెట్టి

ముంగోకరంబు నెమ్మకొనుతను గొట్టినచో మరల మాటాడక పరలోకయాత్ర కామె వేంచేయునని యాగురి మార్చి కొనుత కుంగురిబెట్టి జాగ్రత్తయుని యమునతోఁ జెప్పెను. ఆవల రెండు తుపాకులు గైకొన్న పురుషుఁడు కూడ రాణివైపే గురినిల్పి తెప్పవాల్పక చూడసాగెను. యమునయు మెల్లగ నహల్యాబాయిపైఁ జేతులు వైచెను. వైచిన తక్షణమే గుభిల్లుమని తుపాకినాదము వినఁబడెను. ఆ ధ్వనితో దద్దరిల్లి మహారాష్ట్ర సైన్యమంతయు నిద్రనుండి ప్రబోధింపఁబడి శివనానా, తుకాజీ హోల్కారు మొదలగు సేనాపతులు సకలయోధులు కలవరపడి లేచి హాహాకారములతో రాణి మృతినొందినది రాణి మృతినొందినది యని యఱచుచు నామెగుడారమును జేరిరి. సైనికు లందరు నాక్రందన ధ్వనులతో నానాముఖముల నుండి రాణిగుడారముపై పరుగసాగిరి. శివనానా కన్నీళ్ళతోఁ గావలివాండ్రఁ దిట్టుచుఁ గొట్టుచు మీయజాగ్రత్తచే నేఁడు రాణి చచ్చినదిరా దున్నపోతులారా వెధవలారా పశువులారా మిమ్ము నందరఁ జంపెదను జూడుఁడీ. అయ్యో యని దుఃఖించుచు లోనికరిగి దీపముదెప్పించి యతిదీనముగఁ బడియున్న యొకస్త్రీ శవమును గాంచి యోతల్లీ! యని యామెపైఁబడి గోడువనారంభించెను.

# ఇరువదిమూఁడవ ప్రకరణము

అహల్య మృతినొందినవార్తఁ శ్రవణాంతకరముగ విని శాయాజీ హోల్కారు తనకింక సింహాసనము దక్కి యీయఁబడునని యాసజనించఁదని గుర్తెఱిఁగి తలఁచి, "యామెను నేను దహనము సేయవలెను. సన్నిహితజ్ఞాతి యుండఁగ మరియొకఁడు వల్లకాదు. నన్ను వదలండి" అని భటులను వేగిరపెట్టెను. కాని జాగరూకులై వారతని వామనభట్టునుగాని విడువరైరి. శాంతముగను నిదానముగ నాలోచనమునకు బుద్ధికెక్కునటుల శాజీహోల్కారు గుడారమునఁ బ్రవేశించి యేడ్చుచున్న శివనానాను గనుఁగొని వారించి యాస్థానమును బరికించి తన గంభీరస్వరముతో నిట్లనియె "రాణిగారు సురక్షితులై యున్నారు గడబిడ వద్దు. భయము లేదు. ఈ యమున చచ్చిపడియున్నది. అహల్యకు నురాదనపుత్రుఁ డొకఁడు కూడఁ బడిచచ్చినాఁడు. ప్రాయశః వీఁడు ఫేతాళసింగయియుండును నూరకొనండి" యని కలఁకఁ బ్రజలు నిశ్శబ్దముగ నుండిరి శివనానా యామాటల నాలకించి యాశ్చర్యముతో నా రెండుశవములను నిదానించి చూచి కల వరపాటుచే లేచి పడిసిన బాలహరిణమువలె నోటమాటలేకయున్న కాఁతువీఁపుపైఁ జేయివైచికొని కూరుచున్న యహల్యనుగాంచి, అమ్మా మీరు బాగున్నారా యని పాదములపై బడి రోదనము చేసెను. రాణి వానిపైఁ దనచల్లనియభయహస్తమువేసి, యీ ప్రాణదాన మెవఁడుచేసెనో కాని నేనిగడి

యిపరకు బాగున్నాను. తనకుమారుని నీవు చెరలోఁ బెట్టితి వనునొక వంక బెట్టుకొని యీయమున దురాత్ములగు శత్రువులచేఁ జంపఁబడినది కాఁబోలు నేనది యెఱుఁగక దానిమాటను నమ్మి లోనననుంచినందుకు నాపనిబట్టినది. వీఁడేనా భేతాళసింగు వీనినిగూర్చి పలుమారు విన్నదానను. వానిచావునకే వాఁడిందువచ్చెనని పలికి తానును ముక్తయు సుందరకగుపడుటకు గుడారము ముందరకు వచ్చి నిలిచి వెలుతురు వచ్చుటకు నెగళ్ళు వేయించిరి అప్పుడు రాణి సజీవురాలయి యున్నదని తెలియుటచే రాయజీకిసలువున ప్రాణములుపోయెను. అప్పుడు తుకాజీహోల్కారు రాణితో, "అమ్మా! యీమహోపకారము జేసినవాఁడు మనజమానుఖాను యుండవలయును. ఏడీ యాతఁడెక్కడనున్నాఁడు కాఁడేమి? యని నలుదెసలఁ జూచి యాతనింగానక యాతఁడొకవేళ శత్రువులచేఁ జిక్కెనేమో యని భయపడసాగెను. అంతలో వారియెదుటఁ జుట్టుజరీపట్టెలుగల యెఱ్ఱనిలపాగ జుట్టుకొని పచ్చపట్టువరాయి సర్వపట్టు నిలువుటంగీ తొడిగికొని తెలసూరాకారము నెఱ్ఱ వెలుతురులో నొకచింతకాంతినొంది ముద్దుమూటఁగట్టు నొక క్రొత్త విగ్రహము నిలిచెను. అంద ఱాశ్చర్యనిమగ్నమానసులై వాని మొగమును జూచి "ఏమిది! శ్యామసుందరదత్తిట్లువచ్చినాఁడేమి? నీవింత కాలము నెచట నున్నావోయి యని యడిగిరి. అహల్య వానిని దప్పక చూచి నీవిక్కడనే యున్నావాయని వానిఁ బలుకరింప "అమ్మా! నిరపరాధి యగు శ్యామసుందరుఁడే జమానుఖాను సుఁడీ" యని యేలికకు నమస్కరించెను. ఆనంద బాష్పములతో వానినెత్తి రాణి "నాయనా! నీ

పెను. నేనెంత కాలము కనిపెట్టుకొని యున్నను రఘోబాకాని యాతని బలము గాని నామీఁదికి రాదయ్యెను. తుదకొకఁడు దండెత్తి రానిశ్చయించుకొనలేదని నాకుఁ దెలిసినది" రాణి చెవుల కీమాటలు వినిపించినతోడనే విశేషాశ్చర్యమొంది రాధాకాంతునితో "సరే! నీవు దత్తు నన్యాయముగ వదలి పెట్టుమని గోమాజీరావునకు లేఖ వ్రాసినావు. తరువాత రఘునాథరాయునివద్దనుండి నీకు వచ్చిన జాబుకూడ మాకు దొరకినది. అందుకేమి యుత్తరము చెప్పెదవు" అని ప్రశ్న వేసెను. ఆప్రశ్న విని యుత్తరమీయలేక యొకకొంతసేపు తత్తరపడి యెట్టకేలకు నాతఁడు, "నేను గోమాజీరావునకు జాబులు వ్రాసినానా! రఘునాధరావునద్దనుండి నాకు గమ్మవచ్చినదా? అమ్మా! మీరెంతవరకు మోసపోయినారు! నాపై నసూయ గలిగించవలెనని గోమాజీరావు స్వయముగ వ్రాసియో మరి యొకరిచేత వ్రాయించియో యీజాబులు మీకుఁ జూపినాఁడు. జాబు జూడవచ్చినచో వ్రాఁత యెవరిదో చెప్పెదను" అని విన్నవించెను. విన్నవింప రాణి యారహస్యము వినవలెనను నాత్రముతోఁ దనకు మున్నిచ్చిన గోమాజీరావు సంబంధము లగు రెండులేఖలు రాధాకాంతునిచేతి కిచ్చెను. ఆ యుత్తరములు జదువుకొని రాధాకాంతరావు తనయేలికతోఁ దల్లీ యీవ్రాఁత వామనభట్టుది. వానిచేత వ్రాయించి గోమాజీ మిమ్ము మోసపుచ్చినాఁడు. వామనభట్టువల్ల గొన్ని రహస్యములు బయటకు వచ్చునని పలికెను. తమచేతఁ జిక్కియున్న వామనభట్టును రప్పించి రాణి వెంటనే యాయుత్త

ములఁజూపి యని యెవరి వ్రాతయని యడుగ నతఁడు గద్గ
స్వరుఁడై యీవ్రాఁత తనదని యొప్పుకొనెను. అంతట
శ్యామసుందరదత్తు భట్టు దొడిగికొన్న యంగరకా జేబులో
వెనకే యున్నయొండి మరియొక జాబును దీసి రాణికిచ్చెను. వింత
తరువాతవింత బయలుదేరుటచే రాణి కోపమునాఁపుకొని
నవ్వుచు నా యుత్తరము నీక్రింది విధముగఁ జదువసాగెను.
"గోమాజీరావు ఖేతాళసింగునకు వ్రాయున దేమన మీకు
నింబపురికోట స్వాధీనమగునట్లు నేను సకలసహాయములను
జేసియుండ నాకీయవలసిన సొమ్మునిచ్చుట మీకింత కష్టముగ
నున్నది. మీరు వచ్చునప్పటికి మహాధీరుఁడైన రాధాకాం
తుని మంచియుపాయముచే, దూరదేశమున కంపితిని. ఆ
విశ్వాసమైన మీకు లేదు. ఈయుత్తరమందిన తక్షణము నా
సొమ్ము నాకంపుము" అని రాణి చదివిన యాలేఖను విని
తుకాజీ శివనానా మొదలగువారు దత్తు, రాధాకాంతుఁడు
నోరెత్తలేక కొత్వాలు చేసిన ద్రోహమునకు సిగ్గుపడి
మిన్నకుండిరి. రాణి వారింజూచి నేనింతకాలమును క్రూర
భుజంగములమధ్యఁ గాపురము జేసితిని. ఇంతింత దుర్మార్గు
లుండు దేశమున కెన్నిసేమము గల్గును. రాజపుత్రులు నింబ
పురిపై వానిమాటలు నమ్మివచ్చినారు. ఈఖేతాళసింగు నా
ప్రాణములు దీయఁ దలంచుటలోఁగూడ గోమాజీయొక్క
యాలోచన యుండవచ్చును సుమీ యనెను. అనవుడు
మెల్లగా, అమ్మా! గోమాజీరావుగారు నకా

లన్నియుఁ జెప్పినాఁడు. నేను గడుబీదవాఁడనై తినుట కన్నము లేక యీతఁడు చెప్పినపనిచేసి పొట్టబోసికొనుచుంటిని గాని నే నేలినవారి మీఁదఁ గక్షబూనువాఁడ వీరిలోఁ జేరలేదు. తమ పాదరక్షలు మోయుటకైనఁ దగని బీదబ్రాహ్మణుఁడను. నేను దప్పుఁ గత్తికట్టుట కెంతవాఁడను. నన్ను క్షమింపుము తల్లీ యని వేఁడుకొనెను. ఇది యంతయు నప్పటికి జాముకోడి కూసెను. రాణి నిద్రాభారముచే నలసి సుందరకు సెలవిచ్చి ముక్తతోఁ గూడఁ దాను నిద్రింప నరిగెను. చిరకాలమునకైన నిస్సహాయమగు మనమునకు బాధాశాంతులను శ్యామసుందరత్తును నానందభరితాంతరంగులై నిద్రపోవక తమ కష్టములు చెప్పుకొని యామిగిలిన రాత్రికాలమును గడపిరి ఆరాత్రి భైరవసింగు తప్పించుకొని పారిపోయి కోటజేరి ఫేతాళసింగుయొక్క దుర్మరణవార్త రాణావారికి విన్నవించెను. రాణావారావార్త విని ఫేతాళసింగుతోఁ దమయానయుఁ దుదముట్టిన దని యెరింగి ప్రాణములతో నింబపురము విడిచి యుదయపురము ప్రవేశించుట యుక్తమని యోచి మరునాఁడు రాత్రి భేరీభాంకారాదిధ్వనులు గట్టిపెట్టించి చడిచప్పుడు లేకుండ హతశేషమైన సేనలతో గోటవదలి పారిపోయెను. అర్ధరాత్రి శూరశిఖామణులగు రాజపుత్రులు చేసిన తెగువ నుదయమున నవార్త విని సంతసించి రణదుందుభి నాదములు తన విజయవార్తఁ జాటుచున్నతధ్వజములు దనయాన్నత్యం దెలుపఁగ నాకరముచందమున మహాఘోష

యాసు వేషముతో దాసిగనుండి దైవయోగమున భిల్లులచేతఁ బడితిని,

ఆనంద—అయ్యో! ఆదురాత్ముల చేతినుండి యెట్లు తప్పించుకొన్నావు?

కమల—అక్కడ శాయాజీహోల్కారను నగాము ధేయుఁడొకఁడు నన్ను బెండ్లిగూడవలయు నని యత్నించు మేము వానిని మోసముచేసి యిటకు వచ్చినాము. బాజీరావు నాతమ్ముఁడు గాఁడను కొని యాదురాత్ముఁడు తనకొరకు నన్ను గూర్చి పీనిద్వారా ప్రయత్నించి నన్నుఁ దనకు నను గూర్చినపక్షమున మాతమ్ముని జెరవిడిపించునట్లు వాగ్దానము చేసెను. నేను మగవేషము వేసికొని రాత్రి శాయాజీని దర్శించునట్లు నిర్ణయింపఁబడినందున నేను మగవానిలాగు దాఁడిగి కొని యుంటిని అక్కడు మూర్ఖుఁడగు శాయాజీ ముందుగ నా తమ్ముని జెరవిడిపింపఁ దలంచి పల్లకిఁ దెప్పింప నే నాపల్లకిం గూరుచుంటిని. మగవేషముతో నున్న నాకు నాతమ్మునకును భేద మేర్పరచుట కష్టమైనందున మాతమ్ముఁడే పోవుచున్నాఁడనుకొని యామూర్ఖుఁడు నన్ను విడిచిపుచ్చెను. తరువాత మాతమ్ముఁడు వానిమొద్దకరిగి వాని నొక్కపోటు బొడిచి యాస్థానము జాసి ముందు పయనముచేయు నన్నుఁ గలిసి కొనెను వింటివా మాయవస్థ నాఁటి నీయుపాయము ప్రకారముగ నేఁటివరకు నేను వర్తించుటచే నాకు మానహాని వాటిల్ల లేదు.

ఇట్లు వారు పరస్పర ప్రేమచేఁ గష్టసుఖములఁ జెప్పుకొనుచు నాదినమును గడపిరి. వారల యుత్సాహము గొప్పదిగను ఉండెను.

## ఇరువదినాల్గవ ప్రకరణము

వామనభట్టు రాణిశిబిరమునఁ జిక్కినాఁ డనువార్త వినినతోడనే గోమాజీరావు తనగుట్టిఁక బయలఁబడునని తెలిసి దారపుత్రాదుల విడిచి యుద్యోగము మానుకొని నాఁటి యర్ధరాత్రియందు నిందూరునగరము బాసి పలాయనుఁ డయ్యెను. ఎక్కడికరిగినాఁడో వాని సేవకులుగాని దారపుత్రాదులుగాని యెఱుఁగరు. గోమాజీ యధికమయిన యాశయు స్వల్పమైన ధైర్యమును గల పిరికి మహారాష్ట్రుఁడగుట నతఁడు తన చర్యల భరింపనేరక దేశములపాలయ్యెను. యశ్వంతరావు భిల్లుల నందర నాశనముజేసి కృతకృత్యుఁ డయ్యెఁగండా భిల్లు దొరకమి నిండారు సంతోష మొందక కొండలు, గుహలు, అడవులు, వాగులు సంచరింప సాగెను. దేశమును గొల్లగొన్న భిల్లులును శాయాజీతోఁ జేరిన భిల్లులును దాదాపుగ హతు

ల బలముచే నితర భిల్లులు భయకంపితులై దోఁపిటను తలంపు విడిచి వ్యవసాయములు జేసికొనుటయు బిచ్చమెత్తుకొనుటయు నారంభించిరి. కొందఱు దొంగతనములు మొదలగు వాని మాని మారువేషములతో జనులయొద్ద సేవకులుగాఁ బ్రవేశించి పొట్టబోసికొనసాగిరి. అందుచే గంగాభిల్లు చిక్కుట యసాధ్యమని జస్వంతరావు నిరాశనొంది తుద కల్లె రాణికి లేఖ వ్రాయ వాని నప్పగించినంగాని ముక్తాబాయి నిచ్చుట లేదని రాణి యుత్తర మంపెను. ఇదివరకు పడిన శ్రమ యంతయు వ్యర్థమైనదని గంగాధరుఁడు మరలఁ బ్రయత్నము సేయుచు గోసాయీలను బైరాగులను రప్పించి యెవ్వరియందుఁ దిరుగునెడ వారికి గంగాభిల్లుఁ డెక్కడైన గానంబడునేమో యని యరయుచు నానాశ్రమ లొందుచుండెను. అతఁ డొక నాఁడు మహేశ్వరమున కరుగ నచ్చటి జనులెల్ల నొకమహాత్ముఁడు గ్రామమునకు వచ్చినాఁడనియు నాతఁడు గంగాసింగతి నెఱిఁగింపవచ్చు ననియుఁ దెలిపిరి. "ఇట్టి మహాత్ములు నెందఱినో నేనివరకుఁ జూచినాఁడను. ఎవరును నాకు వాని జాడఁ దెల్పరైరి" అని తిరస్కారముగఁ బల్కి తన బసకుఁ జనియెను. అయినను మఱుపు తాళిక మధ్యాహ్న మొకసారి

యామహాత్ముఁడు జయదేవుని మఠమున కరిగి యాతని దర్శిం
చెను. గాని యాతఁడు మౌనముద్రాధరణ మొనర్చియుండ బయు
రాగి చూచుటకే నాతని నితఁడు పలుకరింపకయే యింటికి
వచ్చెను. రాత్రి జపము ముగిసిన తరువాత నా బయురాగివచ్చి
యు కాని హిందీకీర్తనలు పాడుచు శ్రీకృష్ణుని యమునావిహారము
లు రాధాసరసమును స్తవమొనర్చి యానందించుచుండ నచ్చటికి
మరియొక బయురాగి వచ్చి తన సంచి యందు దింపుకొని
మొదటివాని నడిగి గంజాయి కొంచెము గ్రహించి పీల్చి మహా
రాష్ట్రభాషలో వల్లభాచార్యస్తవాదు లగు పాటలు పాడ
సాగెను. ఇట్లిరువురు వినుచు వచ్చువరకు భగవద్ధ్యానము చేసి
తమతమ కంబళములపైఁ దాము పవ్వళించిన తరి రెండవ
బయిరాగి మొదటివానిని బలుకరింప మొదలుపెట్ట నాతఁడు
మౌనభంగ మగునని కాఁబోలు పలుక నిష్టపడక పదిప్రశ్నల
కొక్క యుత్తరముఁ జెప్పుచు నిద్రింపఁ జొచ్చెను. రెండవ
వాఁడు విధివిరామము లేక ప్రశ్నలడుగఁజొచ్చుటచే నాతఁడు

విసిగి లేచి కూర్చుండి నీ వెన్ని క్షేత్రములు దర్శించితివో యన్ని యడుగు మని కోపముతోం బలికెను. అప్పుడు వారి కిట్లు సంభాషణ జరిగెను.

రెండ—మీరు నామీందం గోపపడవద్దు. గోసాయీజాము. మనలో మనము చెదోండు వాదోండుగ సంచరించిన నన్ను నెవ్వరందురు. నీవు క్రొత్తగ సన్యాశ్రమమును స్వీకరించితివి. మీరు మహాత్ములు. నాకుపదేశ మేదైనం జేయుండు.

మొద—నాకు మంత్రములు రావు. రామా రామా యనుమాట తప్ప నా కేమియు రాదు.

రెండ—మీ రేయే తీర్థములు తిరిగినారు. మి మ్మెక్కడనో చూచినట్లున్నది.

మొద—నేను ప్రయాగ, కాశీ, గయ వెళ్ళినాను. నన్ను నీ వందుం జూచితివా?

రెండ—అయ్యా! యీదినములలో బైరాగులకు సన్యాసులకు దేశసంచారము కష్టముగ నున్నది.

మొద—అవును. ఈ దేశమున మిక్కిలి కష్టము. జస్వంతరావు బయలుదేరి ప్రతిసన్యాసిని బిలిచి గండాభిల్లును నీ వెరుంగుదువా యని యడుగుచుండును. అందుచే సన్యాసులు తమకుం దెలియక పోయినను వానినుండి తప్పించుకొనుటకు నేదో యబద్ధము చెప్పుచుందురు.

రెండ — నన్నా విషయమై యాతఁ డడిగినాఁడు. నేనే మీయొద్ద చెప్పలేదు కాని మీరు చాలదేశములు తిరిగినారు. మీరెక్కడనైన గండాభిల్లును జూచియుంటిరా? పోనిమ్ము వానిజాడ కొంచెము నాకుఁ దెలుపఁగలరా?

మొద — నాకు గండాభిల్లు కనఁబడలేదు. ఆతని విషయమై వేరే ప్రయత్నించుటకంటె మహేశ్వరమునకు సమీపమున నున్న ఋషిని పట్టుకొన్న నన్నియుఁ దెలియును. ఆ ఋషియు గండాభిల్లుఁడును నొక్కటే. భిల్లుల కాలోచన మతఁడే చెప్పి వారి నింత దూరము దెచ్చినాఁడు.

రెండ — అట్లనా. ఆ ఋషియే వారిపక్షము చెప్పిన పక్షమున నిష్కారణముగ మొదట కట్టబడిన గండాభిల్లు వాని కుటీరము నుండి యెట్లు పారిపోయెను? ఆ ఋషిని పట్టుకొని యురిదీయింపఁ బ్రయత్నింతము. కాని గండాభిల్లు యెట్లు పారిపోయెనో చెప్పఁగలరా?

మొద — అయ్యా! నాకెందుకు. గోడలకుఁ జెవు లుండును. ఈ సంగతులు పైకిఁ బొక్కిన నెడల యెరుఁగని మన లనుబట్టి యహల్యాబాయియు జశ్వంతరావుగారును బాధ పెట్టుదురు. మన మా సంగతులు చెప్పుకొనవద్దు. రాజులతో పసి పాముతో చెలగాటము.

రెండ — ఆ మాటనిజమే కాని యీ సంగతులు నేనెవరికిఁ జెప్పను. ఊరూరఁ దిరుగు సన్యాసులము. మనకిట్టి వెందుకు? వినవలెనను కోర్కెచే నడిగితిని. మీకిష్టమైనచో జశ్వంత రావును నేనెరుఁగుదును గనుక వానితోఁ జెప్పి ఋషిని శిక్షించు నట్లు జేసెదను. ఇష్టము లేనిచో నదియు మానెదను.

మొద — నరాధముఁడైన యీ ఋషిని శిక్షించుట నా శిష్టమే. మన రాణీ వినయమై సాహసము పనిచేసి దొంగల పట్టుకొనుటకుపోయిన మొదల మనస్త్రీలు కెందరు. ఆమె సదా వృత్తులిచ్చి మనలను రక్షించుట యెందుకు? ఆఋషిసంగతి ప్రయాగలో నొకనాఁడు తులసీదాసు మఠములో నొక గోసాయి చెప్పఁగా విన్నాను. అది చెప్పెదను విను. వాఁడు ఋషి కాఁడు. మూఁడవ పానిపట్టు యుద్ధమున వీఁడు మహారాష్ట్రులలోనుండి సగము యుద్ధమైన తరువాత తురకలపక్షమునకుఁ దిరిగిపోయినాఁడు. తరువాత తురకలు గెల్చియు వీని నిరాకరించుటచే మనల పీష్వా రాజ్యమునకు నరిగినచోఁ దనను చంపుదురని యీ హోల్కారు రాజ్యమున నున్నాఁడు. వీని పేరు మురారిపంతు. మిక్కిలి వృద్ధుఁడనని చెప్పుకొనును గాని యంతవయస్సు లేదు. తా నెరుఁగుదు నన్న విషయముల నెరుఁగఁడు. వయస్సునుబట్టియు వీనియందు గౌరవము గల్గి మాటలనుబట్టి భక్తి కలిగి ప్రజ లీతఁడు గతానాగతవర్తమానవేదియని యనుకొని వానితో సర్వకార్యములలో నాలోచనము సల్పుచు మోసపోవుచువచ్చిరి. రాధాకాంతరావు మొదలగు బుద్ధిమంతులుగూడ వీనిచే మోసపోయిరి. వాఁడు భిల్లులకు సాయమై దేశములు దోఁచించినాఁడు. కొడుకులు లేరని దిక్కులేని వాఁడనని నాఁడు చెప్పుకొనునే కాని కొంకణ దేశములో వీని కొడుకులున్నారు. భిల్లులతో స్నేహము జేసి వారిచే నూళ్ళు దోఁపించి యీసొమ్ము బిడ్డల కంపును.

రెంప — ఆహాహా! ఎట్టిచిత్రము నేఁడు విన్నామండీ. మీరు రాణికి నాప్తులుగదా! కాని గండాభిల్లెట్లు పారిపోయి

నాఁడో తెలియఁ జెప్పినారు కారు.

మొద—ఆహా! అరే మఱచిపోయినాను. నాఁడు ఋషికుటీరమునఁ జేరి దత్తు దొంగవానికిఁ డ విడిచి యెక్కడికో యురుగ ఋషియొకగొల్లనిచే దావుననున్న భిల్లులకు వర్తమానమంపి మువ్వురను రప్పించి గండాభిల్లును దోఁచుకొని పోయినను. వారు కావలిగాచు బంటౌతును జంపి గండాను వదలించుకొని పోవుచుండ ఋషి తనమీఁద దత్తును గని మానము లేకుండఁ దన్నుఁ గూడఁ గాలుసేతులు గట్టుమని కోరి తన బుద్ధి ప్రకారమే బద్ధించుఁడె. అంగోటియుక్తి చేయఁ బట్టి నాసి దొంగతనము రాణియు దత్తును బట్టుకొన లేరైరి.

ఈ పలుకులు విని రెండవయోగి యెందుచేతనో మితములేని యానందము నొందుచు "మీరు సాక్షాత్తు విశ్వేశ్వరులు. రాణి మీయెడల మిగులఁ గృతజ్ఞతగ నుండును సుండీ" యని పలుక నాతఁడు "మీరు ఋషిని బట్టుకొన వచ్చును. కాని యీ సంబంధమున నా పేరు చెప్పఁబోకుఁడీ. నాసిష్టలు తపములు చెరుపుకొని నేను సాక్ష్యములకుఁ దరుగ నేర" నని పలికి యప్పటికి రాత్రి యతిక్రమించుటచే గుఱ్ఱు పెట్టి గాఢముగా నిద్రపోయెను. రెండవయోగి నిద్రరాకుండ రామస్మరణ జేసికొనుచు మేల్కొనియుండి మొదటివాఁడు నిద్రించిన వెనుక వానిదగ్గర జరిగి మొగముపై మొగముపెట్టి చక్కగ వానిఁ బరీక్షించి తలయూఁచి యనంతరము దూరమున నున్న వాని సంచిదగ్గరకుఁ దీసి యది తన చంకఁ దగిలించుకొని చప్పుడు గాకుండ మెల్ల మెల్లగఁ దలు

పులుఁ దీసికొని పంతము దాఁటి చనెను. తరువాత నాతఁ డాపంచిలోనున్న వస్తువుల నెల్ల వెలికిఁదీసి యందొక ముద్దు టుంగరము మిగుల విలువగల రత్నము సమర్పఁబడిన దానిని గని సంతసించి "యుంగరమా! నీవు విడిగానుండి నాహృదయము దహించుచున్నావా! ఆమె యెందరిగినది" యని కన్నుల నద్దుకొని ముద్దుపెట్టుకొని దానిని మూటగట్టుకొని తన యిచ్చవచ్చిన త్రోవ నరిగెను. ఇంతలో మొదటి బైరాగి మరికొంత గాఢముగ నిద్రించి "ఓ జస్వంతరావు! రాము రాము" యని పలువరించి మరల నిద్రించెను. అనంతరమున నరిగ నొక జాముగువరకు నిరువదుగురు దృఢదేహు లగుభటులతో జస్వంతరావు జయదేవమఠము దగ్గరకు వచ్చి నిద్రించుచున్న యా బైరాగిని లేపి "స్వామీ! మిమ్ముఁ దోడుకొని రమ్మని రాణి సెలవయినది. మీరు భిల్లులసంగతియు ముఖ్యముగ గండాభిల్లు సంగతియు నెఱుఁగుదు రని వారికిఁ దెలిసినది. అందుచేత నీలాఁకిలో నెక్కి మీరు రాణిగారి దగ్గఱకు దయచేసి ఋషివిషయమై భిల్లుల విషయమై సాక్ష్యమియ్యవలయును. రండి" యని పలికెను. బైరాగి యామాటల కాశ్చర్యము నొంది యాశ్చర్యము వదలి తన్ను భయము దృఢముగా నావేశించుటచే నివ్వెరపడి తడబాటుతో "నేనెఱుఁగను. నేను సాక్ష్యము నీయఁజాల. నాజపము విఘ్న మొందును. నన్ను విడువు" మని వేఁడుకొనెను. కాని జస్వంతరావు తాను బట్టినపట్టు వదలక "మీ మూలమున రాజ్యమునకు మహోపకారము జరుగును. దయచేయుఁడి" యని వానిని లాఁకిలో నెక్కించి తిన్నగా నిందూరు నగరమునకుఁ గొనిపోయెను.

# ఇరువదియైదవ ప్రకరణము

అట్లు నింబపురపుకోట నాక్రమించుకొని రాణి గండాభిల్లు దొరకలేదనుచింతదక్క తక్కిన సమస్త శత్రుసంహారము ను దనచేనైనదని శ్రీకాళికావిశ్వేశ్వరులను నమస్కరించి పూర్వమౌరంగజేబుచే నాశనము చేయబడిన యాదేవుని యాలయమును దాను గట్టింతునని ప్రమొక్కుకొని శాయాజీ తోడను వామనభట్టుతోడను ముక్రోడను బయలుదేరి మహోత్సవముతో నింబపురము బాసి తుకాజీ, శివనానా, రాధాకాంతరావు, శ్యామసుందరదత్తు మొదలగు సేనానాయకులు పరివేష్టించి యుభయపార్శ్వముల గొలువ నందూరుపురికి వచ్చెను. రాణిచేసిన యాదరణముచే శాయాజీ ధైర్యముం బూని తన కామె కొన్ని జాగీరులైన నిచ్చునను పేరాసగల్గి నను నడుమ నేమిచేయునో యని సందేహముతో దానుచేసిన పొరబాటునకు వగచుచు రాణితో నరుదెంచెను.

రాణి వచ్చునప్పటికి జస్వంతరావు యోగినొక మందిరమును నుంచి తాన్నెన్నండను వానిని బాయక సకలోపచారముల్ స్వయముగఁ జేయుచు నతిగౌరవమున నాదరించినగరమందంతటఁ బచ్చని పందిళ్ళు వేయించి తోరణములు గట్టించి యనంటి జోడెలునాటించి కలయంపులు జల్లించి ముగ్గులు పెట్టించి శృంగారించి తన సేనతో నామెనెదుర్కొని యామెచే గారవింపబడి యామెను నగరప్రవేశము చేయించి యామె సెలవు ప్రకారముగ వామనభట్టును శాయాజీ మహారాజును గారా

కమల శవమే యని పౌరులు భావించినారు. ఇట్లు మావారు చెప్పినారు.

అహ.—ఆలాగునా? ఇది మతిదాపింతగ నున్నది. పాపము విధవవైన నీ మొగము నాకు చూచుటకు బనులుం గోడు చూచి పరామర్శ చేయువే సివచ్చినది కదా! కమలా! నీవింతకాలము నాయొద్దనున్నను నే నెఱుఁగనైతిని.

ఆనంద.—అమ్మా! నామనవి జేకొనవలెను. ఈమె విధవకాదు. అవివాహిత యగుకన్యక.

అహ.—(కోపముతో) ఈ యబద్ధములను గట్టిపెట్టి నిజముం బల్కుఁడు.

రోహి.—అమ్మా! ఆగ్రహింపకు! యావిషయమై యామె నడుగుట మంచిది.

ముక్త.—కమలా! సత్వరముగ నీ చమత్కారవచనములతో నద్భుతమగు నీచరిత్రమును జెప్పి చాలకాలమునుంచి త్రుప్పుపట్టిన మా చెవులకు విందుచేయుము.

అహ.—కమలా! నీచరిత్ర మామూలాగ్రముగ నెరిం గింపు.

కమ.—తల్లీ! నాచరిత్రము నాలకించి న్యాయమైన రీతినన్నాదరింపఁగోరెదను. శ్రీమాధవరావుగారి పాలనమందున్న వృషపానగరము మా కాపురము. కులమునను స్నేహితుఁడై సంపదలో నిరుపేదయగు నీశ్వరచంద్రుఁడని కుమాత్రైన. మా తండ్రిగారి సుజనాంతరముల మాతల్లి ధనాశకు లోఁగి హరి

హారపాండ్యాజియను బ్రాహ్మణాధముని ప్రేరణచే నన్ను వృద్ధుఁడగు రాణోజీవల్కారున కీయఁదలఁచిననే నెన్నిసారులు వివాహమున కనిష్టత సూచించినను మావారు నా మాటలు సరకుగొనకపోవుటచే రెండుమూడుసారులు రాత్రివేళ నేనొంటరిగ భవానీమాత యాలయమున కరిగి నాకా వివాహము దప్పింపుమని గూర్చుండి వేఁడుకొంటి. దేవి యప్పటికేమియుఁ బ్రత్యక్షోపకారము నాకుఁ జేయకుండిన మాతల్లి యాత్మలాభముం జూచుకొని కొంత ద్రవ్యము వల్కారువద్దనుండి గ్రహించి పెండ్లి నిశ్చయించి తాను పునహోలో వివాహము జరుప శక్తిలేని కారణమున నిందూరు నగరమునకు దీసికొనిపోయి పెండ్లియాడుమని నన్ను వాని కప్పగించెను. అతఁడు నన్ను బెండ్లియాడవలెనని బయలుదేరుటకు మార్గమధ్యమున నపథ్యముచే మడియుటయు మీ రెరుఁగుదురు. తల్లిమాట కెదురుచెప్పఁదలఁచుకొనక యామె యాజ్ఞనెరవేర్ప నాసౌఖ్యము లైన మానఁదలఁచుకొంటిని. గనుక నామె యిష్టప్రకారము నేను వల్కారును బెండ్లియాడుటకు నిష్టము లేక యిష్టపడి వాని వెంటవచ్చితిఁ గాని వివాహమాడకముందె యాతఁడు మృతినొందినాఁడు గాన నేను గన్యను.

అహా — ఏమిరా! దైవయోగము. నీమాటలయందు నాకపనమ్మకము గల్గుచున్నది. నిన్నాతఁడు పెండ్లియాడక పోయినపక్షమున నీవల్లు నెవ్వరితోడను నేల చెప్పవైతివి? పోనీ వైధవ్య మేలయనుభవించితివి?

బాధయడఁగి సూర్యోదయము కాఁగానే రాణి కార్యములం
దీర్చి బైరాగిని వెంటబెట్టుకొని రమ్మని జస్వంతరావునకువర్త
మానమంపెను. బైరాగిని సగౌరవముగఁ దీసికొనివచ్చి రాణి
యెదుట నొక పీఠముపైఁ గూర్చుండఁబెట్టి జస్వంతరావిట్ల
నియెను, "ఓయీ! నీకీరత్నపు ముద్దుటుంగర మెక్కడిది? స్వామీ"
అనఁ దెల్లబోయి బైరాగి ప్రత్యుత్తర మేమియీయవలయు
నని యోచించుకొనుచు దిక్కులు చూచుచుండ రాణి యా
యుంగరమందుకొని చూచి "యిది మా యింట్లో బాయిది. నాఁడు
భిల్లులు దోఁచుకొన్నవు. పోయినది. ఈబైరాగియు భిల్లు
లలోనివాఁడా యేమి" యనియడిగెను. ఆ పలుకులు విని
జస్వంతరావు శాయాజీని రప్పించుచో దీనివిషయమై తేలును
అటు చేయుఁడీ యన శ్రీకుమార మహారాజుగారిని రాణిచెర
నుండి రావించెను. రాజభటులు శాయాజీని నిలువబెట్టిన తరు
వాత జస్వంతరావు వానిని జూచి బైరాగిని జూపి "ఈతఁడెవ్వ"
రని యడిగెను. శాయాజీ రోదనధ్వనితో నీతఁడు గండాభిల్లు
గాఁడా యని పలికెను. వెంటనే రాణి యాశ్చర్యమొంది
యిట్లనియె. "అహల్యాబాయికి హృదయశల్యమును జస్వంత
రావునకు చిరకాలప్రయత్నఫలమును దేశసౌఖ్యమునకుఁగా
ర్చిచ్చునునగు దురాత్ముఁడాయీ బైరాగి వేషము ధరించిన
వాఁడు. గండాభిల్లు పేరువిన్నచో నిందూరు రాజ్యమునందున్న
సుందరులెల్ల గుండెలవిసెనుగద! ఈతని మూలముననే నేను
నా ప్రాణములను నొక్కనాఁడైన కడుపారఁ బట్టెడన్నము దినని
యెఱుఁగము. ఈతఁడు నాభాగ్యవశమునఁ జిక్కినాఁడు. భిల్లుల
నందరఁ గూల్చుట యొకయెత్తు వీనిఁ గూల్చుట యొకయెత్తు

వలె శాయాజీ యను పేరు బెట్టుకొని రాణికి సన్నిహితజ్ఞాతి యని స్వల్పకాలము మహారాజభోగ మనుభవించి దౌలతరావు చేతిలోని కీలుబొమ్మయై దేశక్షోభకుఁ గారణుడైన మహారాజుగారును మన్నెపల్వానులును గండాభిల్లును నేకకాలముననే యురిదీయఁబడుట కై చెట్లకుగట్టఁబడిరి పాపము! దుండిరావున కెంతకష్టమువచ్చెనది! దుండిరావును గండాభిల్లును నేకకాలముననే యురిదీయఁబడిరి. వాని భట్టును క్షమియించి రాణి వానిని రెండుసంవత్సరములు చెరసాల నుంచెను. వికలాంగుడైన కృష్ణపంతునకుఁ బలిసేయనక్కర లేక యేనెలకు నేబదిరూకలు జీవితమేర్పరచెను. కమల తమ్ముఁడగు బాజీరావునకు నెలకు ముప్పదిరూకలు జీవితమేర్పరచి యొక యుద్యోగ మొసఁగెను. తరువాత నొకటి యుద్ధములలో విశ్వాసవంతులగు వారికి బహుమానములు బిరుదులు నొసఁగుచు శ్యామసుందరునకుఁ గొత్వాలుపని నొసంగెను. తరువాత వివాహములు సేయ నిశ్చయించి దత్తునకు గమలయు సమానశాఖలోఁ జేరిన శూద్రజాతీయుని తెలిసి శుభముహూర్తమున వారిరువురకును ముక్తకును ప్రతిజ్ఞాసముద్రమును ధైర్యమును తెప్పించె పీఁడిన జస్వంతరావునకు వివాహములు చేసెను. శ్యామ

